కీ॥ శే॥ శ్రీమతి తల్లం కమలమ్మగారి

స్మారక చిహ్నము



జననం:
15—9—1920

మరణం:
13—4—1966

జిజ్ఞాసువులైన అధ్యాత్మ సాధకుల ఉపయోగార్థమై
ఈ గ్రంథము ప్రచురింపబడినది గావున
యీ గ్రంథము విక్రయమునకు కాదు.

# తప్పులు - ఒప్పులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 14 | అధికారీఽతు | అధికారీతు |
| 4 | 17 | సర్గాది | స్వర్గాది |
| 8 | 16 | ఇహాముత్రార్ధ | ఇహాముత్రార్థ |
| 10 | 14 | సుకదుఃఖములు | సుఖదుఃఖములు |
| 13 | 12 | బ్రహ్మనిష్ఠ | బ్రహ్మనిష్ఠం |
| 13 | 17 | సంతృప్తుడైన | సంతప్తుడైన |
| 16 | 5 | జలోయా | జలాశయ |
| 17 | 21 | వ్యష్టభిప్రాయేణ | వ్యష్ట్యభిప్రాయేణ |
| 18 | 1 | సమిష్టి | సమష్టి |
| 19 | 5 | జాగ్రత్స్వప్నసుషుప్తులను | జాగ్రత్స్వప్నసుషుప్తులగు |
| 19 | 13 | ప్రజ్ఞ | ప్రాజ్ఞ |
| 19 | 20 | ప్రాజ్ఞులకు | ప్రాజ్ఞునకు! |
| 20 | 17 | సుఖరూపేతి | సుఖరూపమేతి |
| 21 | 7 | ఎట్లు | ఎట్లి |
| 22 | 7 | ఇతమేవ | ఇదమేవ |
| 22 | 10 | వాఖ్యార్థము | వాచ్యార్థము |
| 22 | 13 | ,, | ,, |
| 24 | 5 | ముద్భావయత్వే | మధ్భావయత్వే |
| 25 | 2 | ఆపరబ్రహ్మనే | ఆ పరబ్రహ్మయే |
| 25 | 7 | కావు | కావున |
| 26 | 10 | పంచభూతములను | పంచభూతములును |
| 28 | 3 | 54 | 65 |
| 32 | 20 | కేచితూ | కేచిత్ |

# ఉపోద్ఘాతము

ఈ వేదాంతసారమనునది ఉపనిషత్సాహిత్యములో నొక ప్రసిద్ధ ప్రకరణగ్రంథమై యున్నది. ఇది ఆంగ్లము మొదలైన అనేకభాషలలోనికి అనువదింపబడి బహుజనాదరము పొందినది. అంతియేకాక దీనికి నేశీవాసులగు నృసింహ సరస్వతి వారు విరచించిన సుబోధిని; ఆపోదేవులు రచించిన బాలబోధిని; మధుసూదన సరస్వతికి గురువగు రామతీర్థులు రచించిన విద్వన్మనోరంజని అను వ్యాఖ్యానములు కూడ కలవు. ఈ వ్యాఖ్యానములద్వారా యీ గ్రంథమునకు బహుళప్రచారము కలుగుటయేకాక ఈ గ్రంథము బహుజనామోదమును కూడ పొందినది. దీనిని అద్వయానంద సరస్వతి శిష్యులగు సదానంద యోగీంద్ర సరస్వతివారు విరచించిరి.

ఈ వేదాంతసారమను గ్రంథము గౌడపాద, శంకర సురేశ్వరాచార్య మొదలగువారి ప్రసిద్ధ వేదాంతగ్రంథములకు ఉపోద్ఘాతమువంటిదై యున్నది. వారి రచనలను గ్రంథకర్త తనగ్రంథమునందుదహరించియున్నారు.

ఇందు తత్త్వాన్వేషికి కావలసిన అధికారిలక్షణాదులను చెప్పి అంతమున తత్త్వమసి యను మహావాక్యవివరణచేసి

యున్నారు. మరియు బ్రహ్మజ్ఞానము కలుగకుండ ఆటంక పరచునది అజ్ఞానమే కావున దానిని తొలగించుటకు ఆ అజ్ఞాన లక్షణమును తెలిసికొనవలసి యున్నది. కావున యీ అవిద్య యొక్క సమష్టివ్యష్టి రూపములను, తత్కార్యమైన జగదుత్పత్తి విధమును, ఈ జడ ఉపాధులను ఆ పరమాత్మకుగల భేదమును వివరించి యున్నారు. ఆ సందర్భములో చార్వాక భాట్ట బౌద్ధమత మూలసూత్రములనుకూడ వివరించి ఖండించబడినవి. తుట్టతుదకు తత్త్వమసి యను బోధనా వాక్యమును, అహం బ్రహ్మాస్మి యను అనుభవవాక్యమును విశ్లేషించి యుక్తి ప్రపత్తులతో వివరించి యున్నారు. అంతమున జీవన్ముక్తి లక్షణములను చెప్పినారు. దీనివలన స్వార్థరహిత సంయమిత జీవనమే జీవ న్ముక్తునకు సహజ లక్షణమని తెలియుచున్నది. అట్టివాడే భూమిమీద దేవుడు. ఇదియే వేదాంతసారము.



ఓం

శ్రీ సద్గురు నిరంజన్
సేవా నిలయము Det^a

# విషయసూచిక

5-8-70
BOMBAY

# వేదాంతసారము

## అధ్యాయము-౧

అఖండం సచ్చిదానందమవాఙ్మనసగోచరం ।
ఆత్మానమఖిలాధారమాశ్రయేఽభీష్టసిద్ధయే ॥ 1

తా॥ అఖండమై, సచ్చిదానంద స్వరూపమై, అవాఙ్మనస గోచరమై సమస్తమునకును ఆధారభూతమైన ఆ పరమాత్మను అభీష్టసిద్ధికై ఆశ్రయించుచున్నాను.

"యతో వా ఇమాని భూతాని జాయన్తే" అను శ్రుతి ప్రకారము ఆత్మ అఖిలాధారమై యున్నది.

తాను వ్రాయు గ్రంథము నిర్దుష్టముగా శాస్త్రానుసారము కొనసాగుటయే యిచట గ్రంథకర్తయొక్క అభీష్టము కావున నిర్విఘ్నముగా గ్రంథము పరిసమాప్తి పొందుటయే అభీష్టసిద్ధి యగును.

లేదా సమస్తలోక కల్యాణము సిద్ధించుటయే యిచట అభీష్టసిద్ధియని కూడ అనుకొన వచ్చును.

అర్థతోఽప్యద్వయానందా నతీతద్వైతభానతః ।
గురూనారాధ్య వేదాంతసారం వక్ష్యే యథామతి ॥ 2

తా॥ ద్వైతభావమును అధిగమించి ప్రకాశించుటచేత సార్థక నామధేయుడైన అద్వయానంద గురువును ఆరాధించి బుద్ధికి తోచినంత వేదాంతముయొక్క సారమును వివరించుచున్నాను.

గ్రంథకర్తయగు సదానందుల ఆధ్యాత్మిక గురువుయొక్క నామము అద్వయానంద. పరమోత్కృష్టమైన ఆధ్యాత్మిక జ్ఞానము కలవాడగుటచేత గురువు సార్థకనామధేయుడగుచున్నాడు. మరియు అద్వయానంద అను పదము పరమాత్మను కూడ సూచించుచున్నది. కావున యిచట తన గురువును ఆ పరమాత్మనుకూడ నమస్కరించి గ్రంథకర్త గ్రంధారంభమును చేయుచున్నాడు.

## వేదాంతపద అర్థ వివరణము

వేదాంతో నామ ఉపనిషత్ప్రమాణం తదుపకారీణి
శారీరకసూత్రాదీని ॥ 3

తా॥ వేదాంతమనగా ఉపనిషత్ప్రమాణముగల విషయము. మరియు తదుపకారకమైన శారీరక సూత్రాదులు కూడ వేదాంతమే యగుచున్నది.

వేదాంతముయొక్క వాఖ్యార్థము - వేదములయొక్క చివరభాగము. లేదా ఆధ్యాత్మిక విషయమును బోధించు వేదభాగము.
ప్రమాణములు ఆరు విధములు:

1. ప్రత్యక్ష ప్రమాణము
2. అనుమాన ప్రమాణము
3. ఉపమాన ప్రమాణము
4. శబ్ద ప్రమాణము
5. అర్థాపత్తి
6. అనుపలబ్ధి.

ఉపనిషత్తులు శబ్దప్రమాణము లగుచున్నవి.

శారీరక సూత్రములు, బాదరాయణునిచే రచింపబడినవి. అవి జీవతత్త్వమును నిర్ణయించునవై యున్నవి.

ఉపనిషత్తులను వ్యాఖ్యానించు ఇతర శాస్త్రములన్నియు తదుప కారకములై యున్నవి.

అస్య వేదాంతప్రకరణత్వాత్ తదీయైః ఏవ
అనుబంధైః తద్వత్తాసిద్ధేః న తే పృథగాలోచనీయాః॥ 4

తా॥ ఈ వేదాంతసారము ఒక ప్రకరణ గ్రంధము. ఇచట అనుబంధముల ద్వారానే ఆ వేదాంత వివరణము సిద్ధించుచున్నది. కావున ఆ అనుబంధములు ప్రకరణముకంటె భిన్నములని తలవరాదు.

తత్ర అనుబంధోనామ అధికారి విషయ
సంబంధ ప్రయోజనాని॥ 5

తా॥ అనుబంధములు నాలుగు. 1. అధికారి, 2. విషయము, 3. సంబంధము, 4. ప్రయోజనము అనునవి.

ప్రతియొక్క హిందూశాస్త్ర గ్రంధమునకును మున్ముందుగా ఈ అనుబంధ చతుష్టయము వివరింపబడుచున్నది.

అధికారీ తు విధివదధీతవేదవేదాంగత్వేనా పాతతోఽధిగతాఖిలవేదార్థోఽస్మిన్ జన్మని జన్మాంతరే వా కామ్యనిషిద్ధవర్జనపురస్సరం నిత్య నైమిత్తిక ప్రాయశ్చిత్తోపాసనానుష్ఠానేన నిర్గతనిఖిలకల్మషతయా నితాంత నిర్మలస్వాంతః సాధనచతుష్టయసంపన్నః ప్రమాతా॥ 6

తా॥ వేదవేదాంగములను శాస్త్రోక్త విధిని అధ్యయనము చేసి సామాన్యముగా సమస్త వేదార్థమును అవగాహన చేసికొనినవాడై, యీ జన్మ

యందుగాని జన్మాంతరమందుగాని, కామ్యనిషిద్ధ కర్మలను త్యజించుటయే కాక నిత్యనైమిత్తిక ప్రాయశ్చిత్త ఉపాసనాదులననుష్ఠించి అఖిల పాపములనుండి ముక్తుడై, తత్ఫలితముగా మిక్కిలి నిర్మలమైన స్వాంతముగలవాడై, సాధన చతుష్టయముతో కూడిన జిజ్ఞాసువే అధికారి యగుచున్నాడు.

శాస్త్రోక్త విధులు - బ్రహ్మచర్యాదులు

వేదాంగములు:-1. శిక్షా - స్వర ఉచ్చారణ శాస్త్రము.

2. కల్పము - కర్మాచరణ విధానమును వివరించు సూత్రములు.

3. వ్యాకరణము.

4. నిరుక్తము - కఠినశబ్దములవ్యుత్పత్తి వివరణము.

5. ఛందస్సు.

6. జ్యోతిషము.

విదురాదులు యీ జన్మయందు శాస్త్రాధ్యయనాది విధులను పాటింపకున్నను జ్ఞానులైరనిన అందులకు పూర్వజన్మ సంస్కారమే కారణము. కావున జన్మాంతరమందే వారు అధికారిత్వమును పొంది యున్నారు.

కామ్యాని - స్వర్గాది ఇష్టసాధనాని జ్యోతిష్టోమాదీని॥ 7

తా॥ స్వర్గాది పుణ్యలోకములను పొందుటకు సాధనములైనవి కామ్యకర్మలగును. అనగా "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" స్వర్గకాముడు జ్యోతిష్టోమమును చేయవలయును అని శ్రుతి చెప్పుచున్నది కావున స్వర్గమును కోరువాడు జ్యోతిష్టోమమును చేయుచున్నాడు. ఈ యాగములు నిర్దిష్టమైన ఫలమునిచ్చునవికావున అట్టి నిర్దిష్టమైన ఫలమునుకోరి చేయుటచే ఇవి కామ్యకర్మలగు చున్నవి.

నిషిద్ధాని - నరకాద్యనిష్టసాధనాని బ్రాహ్మణ
హననాదీని ॥ 8

తా॥ నరకమును చేర్చు బ్రహ్మహత్యాది కర్మలు పాపకర్మలు కావున అవి నిషిద్ధ కర్మలగుచున్నవి. ఈ కర్మలు పరమందు నరకమును ఇహమందు దుఃఖమును కలిగించును.

నిత్యాని - అకరణే ప్రత్యవాయసాధనాని
సంధ్యావందనాదీని ॥ 9

తా॥ కొన్ని వేదోక్త కర్మలు కలవు. అవి చేయుటవలన క్రొత్తగా పుణ్యము కలుగదుగాని అవి చేయకపోవుటవలన తప్పక పాపము మాత్రము కలుగును. అట్లు ఆ కర్మలనాచరించకపోవుటవలన కలుగు పాపము కలుగకుండ చేయుటకే ఆ కర్మలను చేయవలయును. వీనినే నిత్యకర్మలందురు.

సంధ్యావందనము, పంచమహాయజ్ఞములు మొదలైనవి గృహస్థునకు నిత్యకర్మలై యున్నవి.

నైమిత్తికాని - పుత్రజన్మాద్యనుబంధీని జాతేష్ట్యాదీని॥

తా॥ ఒక నిమిత్తమును పురస్కరించుకొని చేయు కర్మలు నైమిత్తికములు. ఉదాహరణకు పుత్రజన్మను నిమిత్తముగా చేసికొని చేయు జాతేష్టి మొదలైనవి. ఇవికూడ గృహస్థునకు విహితకర్మలే యగుచున్నవి.

ప్రాయశ్చిత్తాని - పాపక్షయ సాధనాని చాంద్రాయణాదీని ॥ 11

తా॥ పాపపరిహారార్థముచేయు కర్మలు ప్రాయశ్చిత్తములు. ఉదాహరణకు చాంద్రాయణాదులు. కృచ్ఛ్రము మొదలగునవి కూడ వీనిలో చేరుచున్నవి.

ఉపాసనాని - సగుణబ్రహ్మవిషయమానసవ్యాపార
రూపాణి శాండిల్యవిద్యాదీని ॥ 12

తా॥ మానసికమైన సగుణబ్రహ్మారాధన ఉపాసనయగుచున్నది శాండిల్య విద్యయందు ఈ ఉపాసనా విధులు పేర్కొనబడి యున్నవి. జీవ బ్రహ్మైక్యమును కలిగించునట్టి జ్ఞానకాండకంటె యీ ఉపాసన భిన్నమగు చున్నది ఇట్టి ఉపాసనా సౌలభ్యము కొరకే త్రిమూర్త్యాది సగుణ రూప ములను రూపొందించినారు. ఇట్టి సగుణోపాసనద్వారా మనస్సు ఏకాగ్రతను పొందుచున్నది కావున అట్టి ఏకాగ్రత పొందిన మనస్సునకు బ్రహ్మజ్ఞానము సిద్ధించును.

ఛాందోగ్యోపనిషత్తులోని శాండిల్యవిద్య యిట్టి ఉపాసనయే యగు చున్నది.

ఏతేషాం నిత్యాదీనాం బుద్ధిశుద్ధిః పరం ప్రయోజన
ముపాసనానాం తు చిత్తైకాగ్ర్యం "తమేత మాత్మానం
వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన"
(బృ ఉః 4-4-22) ఇత్యాది శ్రుతేః "తపసా కల్మషం
హన్తి" (మను. 22-104) ఇత్యాది స్మృతేశ్చ ॥ 13

తా॥ ఈ నిత్య నైమిత్తికాది కర్మలు చిత్తశుద్ధిని కలిగించును. ఉపా సనలు చిత్త ఏకాగ్రతను కలిగించును. ఇదియే వీని పరమప్రయోజనము. "నిత్యనైమిత్తికైరేవ కుర్వాణో దురితక్షయం - నిత్యనైమిత్తిక కర్మలచే పాపమును క్షీణింపచేసి" అని స్మృతియు, "స్వేస్వే కర్మణ్యభిరతః - తమ తమ కర్మలను చేయుచు మానవుడు సంసిద్ధిని పొందుచున్నాడు" అని గీతయు చెప్పుచున్నది. ఇంతేకాక నైష్కర్మ్యసిద్ధి యను గ్రంథములో ఇట్లున్నది - నిత్య నైమిత్తికాదికర్మలు పాపమును పరిహరించి పుణ్యమును

కలిగించి, తద్వారా చిత్తశుద్ధిని కలిగించును. ఇట్టి చిత్తశుద్ధివలన సంసార తత్త్వమును తెలుసుకొనగలుగుచున్నాడు కావున అతనికి అందుండి నివృత్తి కలుగుచున్నది. ఈ నివృత్తి ఫలితముగా వైరాగ్యము కలుగుచున్నది. వైరాగ్యము మోక్షేచ్ఛను రగుల్కొలుపును. అంతనతడు మోక్షమును సాధించుటకై సాధనలనన్వేషించును. అంత సర్వకామ్య కర్మలను త్యజించుచున్నాడు. ఇదియే సన్యాసయోగము. దీనిచే మనస్సు ఆత్మతత్త్వమందు స్థిరముగా నాటుకొనుటకు అలవాటుపడుచున్నది. అంత తత్త్వమస్యాది వాక్యమును సులభముగా గ్రహించుచున్నాడు. అజ్ఞానము నశించుచున్నది. అంతమున ఆత్మయందు ప్రతిష్ఠితుడగుచున్నాడు. ఇట్లు పరంపరయా చిత్తశుద్ధి చిత్తైకాగ్ర్యములు మోక్షమునకు కారణమగుటచే వానినే నిత్యనైమిత్తికాదులకు ఉపాసనలకు పరమ ప్రయోజనముగా చెప్పియున్నారు. "వేదపాఠమువలనను యజ్ఞయాగాదులద్వారాను ఆ ఆత్మతత్త్వమును బ్రాహ్మణులు తెలిసికొనగోరుచున్నారు" అని బృహదారణ్యకోపనిషత్తు చెప్పుచున్నది. మరియు "తపస్సుచేత పాపములను తొలగించుకొనుచున్నారు" అని మనుస్మృతి చెప్పుచున్నది.

> నిత్యనైమిత్తికయోః ఉపాసనానాం తు అవాంతరఫలం
> పితృలోక సత్యలోక ప్రాప్తిః "కర్మణా పితృలోకః
> విద్యయా దేవలోకః" (బృ-ఉ- 1-5-16) ఇత్యాది
> శ్రుతేః ॥ 14

తా॥ నిత్య నైమిత్తికాది కర్మలకు ఈ ఉపాసనలకు కూడ అవాంతర ఫలములు గలవు. ప్రాయశ్చిత్తాదులకు పరలోకమందు ప్రత్యేకఫలము లేక పోవుటచేత వానిని యిందు చేర్చలేదు. కాని నిత్యనైమిత్తికాదులకైతే చిత్తశుద్ధి చిత్తైకాగ్ర్యమే కాక నిత్యనైమిత్తికాదులకు పితృలోక ప్రాప్తియు ఉపాసనలకు బ్రహ్మలోకప్రాప్తియు అవాంతరఫలములు కూడ

కలవని చెప్పియున్నారు. కర్మలచే పితృలోకము, విద్యచే దేవలోకము కలుగునని శ్రుతివాక్యము.

> సాధనాని - నిత్యానిత్యవస్తువివేకేహాముత్రార్థఫలభోగ
> విరాగ శమాదిషట్కసంపత్తి ముముక్షుత్వాని ॥ 15

తా॥ నిత్యానిత్య వస్తు వివేకము, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమదమాదిషట్క సంపత్తి, ముముక్షుత్వము, అను నీ నాలుగున్ను జ్ఞానప్రాప్తి సాధనములగు సాధన చతుష్టయ మనబడుచున్నవి.

> నిత్యానిత్య వస్తువివేకస్తావత్ బ్రహ్మైవ నిత్యం వస్తు
> తతోఽన్య దఖిలమనిత్యమితి వివేచనం॥ 16

తా॥ బ్రహ్మయే నిత్యమైన వస్తువు బ్రహ్మకంటె యితరమైన సమస్తమును అనిత్యము అను విచక్షణా జ్ఞానమే నిత్యానిత్యవస్తు వివేకము.

> ఐహికానాం స్రక్చందన వనితాది విషయభోగానాం
> కర్మజన్యతయానిత్యత్వవదాముష్మికాణామప్యమృతాది
> విషయ భోగానా మనిత్యతయా తేభ్యోనితరాం
> విరతిః - ఇహాముత్రార్ధ ఫలభోగవిరాగః॥ 17

తా॥ ఐహికములగు స్రక్చందన వనితాది భోగములు ఎంత అనిత్యమో యజ్ఞయాగాది కర్మఫలముగా ప్రాప్తించు ఆముష్మికమైన స్వర్గాది అమృత భోగములుకూడ అంత అనిత్యమే యగును. "క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి - పుణ్యము క్షీణించగా మర్త్యలోకమును చేరుచున్నారు"

అను గీతా వచనముచేతను "తద్యథా ఇహకర్మజితా లోకాః క్షీయతే ఏవమేవ అముత్ర పుణ్యజితా లోకాః క్షీయతే - ఇచట కర్మలద్వారా పొందిన లోకము లెట్లు నశించుచున్నవో అట్లే పరమందు పుణ్యముచే పొందబడిన లోకములుకూడ నశించుచున్నవి" అను శ్రుతిచేతను, ఈ కర్మ ఫలములన్నియు అనిత్యములే యని తేట తెల్లమగుచున్నది. కావున ఇహపర భోగములందు అత్యంతమైన విరక్తియే ఇహాముత్రఫలభోగవిరాగమగు చున్నది.

తృతీయ సాధనయగు శమనమాదిషట్కసంపత్తి ఇట్టి వైరాగ్యము లేక సాధ్యముకాదు.

శమాదయస్తు - శమదమోపరతితితిక్షాసమాధాన
శ్రద్ధాఖ్యాః ॥ 18

తా॥ శమ - దమ - ఉపరతి - తితీక్షా - సమాధాన - శ్రద్ధలు అను ఈ ఆరున్నూ శమాదులగుచున్నవి. ఇవి లేక మోక్షేచ్ఛ కలుగుటకు అవకాశము లేదు. ఈ శమాదులను క్రింద వివరించుచున్నాడు.

శమస్తావత్ - శ్రవణాది వ్యతిరిక్త విషయేభ్యో మనసో
నిగ్రహః ॥ 19

తా॥ శ్రవణ మనన నిధిద్యాసలు తప్పించి మిగిలిన సమస్త విషయ వాంఛలనుండి మనస్సును మరలింపజేయగలుగు చిత్తవృత్తియే శమము.

దమః - బాహ్యేంద్రియాణాం తద్వ్యతిరిక్తవిషయేభ్యో
నివర్తనం ॥ 20

తా॥ పంచజ్ఞానేంద్రియములు పంచకర్మేంద్రియములు బాహ్యమైన

దశవిధ ఇంద్రియములు వీనిని ఆయా విషయ క్షేత్రములనుండి అంతరింద్రియ మగు మనస్సుద్వారా మరలించి అంతర్ముఖము చేసికొనుట దమము.

నివర్తితానామేతేషాం తద్వ్యతిరిక్తవిషయేభ్య ఉపర
మణ ముపరతిరథవా విహితానాం కర్మణాం విధినా
పరిత్యాగః ॥ 21

తా॥ ఇట్లు మరలింపబడిన యింద్రియములను మరల విషయాన్వేషణతో బహిర్ముఖము కాకుండ అంతఃకరణమందే అణచియుంచుట ఉపరతి. ఈ ఉపరతి లక్షణమునకును శమదమాది లక్షణమునకును ఎక్కువ భేదము లేకపోవుటచేత ఉపరతికి మరియొక లక్షణమును చెప్పుచున్నాడు. నిత్య నైమిత్తికాది కర్మలను విధ్యుక్తముగా త్యజించునట్టి సన్యాసము అని అర్థము. విధినా అని చెప్పుటచేత సోమరితనముచే త్యజించుట కాదని స్పష్టపరచు చున్నాడు.

తితిక్షా - శీతోష్ణాది ద్వంద్వసహిష్ణుతా ॥ 22

తా॥ శీతోష్ణములు, సుకదుఃఖములు మొదలగు ద్వంద్వములను సహించుటయే తితిక్ష యగుచున్నది.

“సహనం సర్వదుఃఖానాం అప్రతీకార పూర్వకం।
చింతావిలాపరహితం సా తితిక్షా నిగద్యతే॥” (వివేక చూడామణి)

తా॥ సమస్త దుఃఖములను ప్రతీకారభావము లేకుండను చింతా విలాపములు లేకుండను సహించుటయే తితిక్ష అనబడుచున్నది.

నిగృహీతస్య మనసః శ్రవణాదౌ తదను
గుణ విషయేచ సమాధిః - సమాధానం ॥ 23

తా॥ ఇట్లు నిగ్రహించిన మనస్సును శ్రవణమననాదులందును, తదను గుణమైన గురు శుశ్రూషయందును శాస్త్రగ్రంథ రచనాదులందును ఏకాగ్ర పరచుట సమాధానమగును.

గురూపదిష్ట వేదాంతవాక్యేషు విశ్వాసః - శ్రద్ధా ॥ 24

తా॥ విశ్వాసము లేక ఆధ్యాత్మిక సాధన కాంక్షించిన ఫలము నొసగ జాలదు కావున గురూపదిష్టమైన వేదాంత వాక్యములందు నమ్మకమే శ్రద్ధ యనబడుచున్నది.

ముముక్షుత్వం - మోక్షేచ్ఛా ॥ 25

తా॥ మోక్షమందు ఇచ్ఛయే ముముక్షుత్వము. పైని చెప్పిన మూడు సాధనలు గలవానికి మోక్షమందు తప్పక కోరిక కలిగి తీరును. అప్పుడే ఆ సాధకుడు ఆత్మవిద్యను పొందుటకు తగిన అధికారి యగు చున్నాడు.

ఏవం భూతః ప్రమాతాధికారీ "శాన్తో దాంతః"
(బృ - ఉ - 4-4-23) ఇత్యాది శ్రుతేః। ఉక్తంచ

ప్రశాంత చిత్తాయ జితేంద్రియాయ చ
ప్రహీణదోషాయ యథోక్తకారిణే।
గుణాన్వితాయానుగతాయ సర్వదా
ప్రదేయమేతత్ సతతం ముముక్షవే॥ ఇతి ॥ 26

(ఉపదేశసాహస్రీ - 324 - 16 - 72)

తా॥ ఇట్టి లక్షణములు గలవాడే అధికారి యగుచున్నాడు.

"తస్మాత్ ఏవంవిత్ శాంతో దాంతః ఉపరతి స్తితిక్షుః
సమాహితో భూత్వా ఆత్మన్యేవ ఆత్మానం పశ్యతి.

కావున యిట్టి శాంతదాంత ఉపరతి తితీక్షా సమాధానములు గలవాడైన జిజ్ఞాసువు ఆత్మయందే ఆత్మను చూచుచున్నాడు" అను శ్రుతివలన శమాది షట్క సంపత్తికలిగి కల్మషములను పోగొట్టుకొనినవాడై, గుర్వాజ్ఞా కారియై, సద్గుణవంతుడై గురువు ననుసరించునట్టి శిష్యునకు ఎల్లప్పుడు ఈ బ్రహ్మవిద్యను ఉపదేశింప వలయునని ఉపదేశసాహస్రి చెప్పు చున్నది.

విషయః - జీవబ్రహ్మైక్యం శుద్ధ చైతన్యం ప్రమేయం
తత్ర ఏవ వేదాంతానాం తాత్పర్యాత్ ॥ 27

తా॥ అధికారి లక్షణాదులుగల ప్రథమ అనుబంధమును వివరించిన తరువాత ద్వితీయ అనుబంధమైన "విషయ"మును వివరించుచున్నాడు. అందు జీవబ్రహ్మైక్యమే అద్వైత వేదాంతుల సిద్ధాంతమై యున్నది. కావున గుణాతీతమైన ఆ శుద్ధ చైతన్యమందు అజ్ఞానముచే అధ్యారోపితమైన జీవత్వ మును వదలి ఆ అఖండ సచ్చిదానంద బ్రహ్మయందైక్యము చెందుటయే జీవబ్రహ్మైక్య మగుచున్నది. అట్టి జీవ బ్రహ్మైక్యమే యీ గ్రంథము యొక్క విషయము.

సంబధస్తు - తదైక్య ప్రమేయస్య తత్ప్రతిపాదకోపనిష
త్ప్రమాణస్య చ బోధ్యబోధక భావః ॥ 28

తా॥ జీవ బ్రహ్మైక్యమను విషయమునకును, దానిని ప్రతిపాదించు ఉపనిషత్తులకును గల బోధ్య బోధక భావమే సంబంధము.

ప్రయోజనంతు - తదైక్య ప్రమేయ గతాజ్ఞాన నివృత్తిః స్వస్వరూపానందావాప్తిశ్చ "తరతి శోకం ఆత్మవిత్ (ఛా-ఉ - 7-1-3) ఇత్యాది శ్రుతేః "బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి" (ముణ్డక-ఉ 3-2-1) ఇత్యాదిశ్రుతేశ్చ॥

తా॥ జీవబ్రహ్మైక్య జ్ఞానమును ఆటంక పరచునట్టి అజ్ఞానము తొలగుట, స్వస్వరూపమైన ఆనందమును పొందుట అనునవి ఇచట ప్రయోజనములు. "ఆత్మజ్ఞాని శోకమును తరించుచున్నాడు." "బ్రహ్మజ్ఞాని బ్రహ్మయే యగుచున్నాడు" అని శ్రుతి చెప్పుచున్నది,

## గురువుయొక్క ఆవశ్యకత

అయమధికారీ జనన మరణాది సంసారానలసంతప్తో దీప్తశిరా జలరాశిమివోపహారపాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠ గురుముపసృత్య తమనుసరతి "తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియ బ్రహ్మనిష్ఠం" (ముణ్డక 1-2-12) ఇత్యాది శ్రుతేః॥ 30

తా॥ తలకు నిప్పంటుకొనగా జలాశయము నుద్దేశించి పరుగెత్తికొని పోవు వ్యక్తివలె జనన మరణ విశిష్టమైన యీ సంసారమనెడి అగ్ని చేత సంతప్తుడైన యీ అధికారి కూడ బ్రహ్మనిష్ఠుడు, శ్రోత్రియుడునైన గురువును సమీపించి అతనిని అనుసరించి సేవించవలెను. "శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడునగు గురువును సమిత్పాణియై శిష్యుడు చేరవలెను" అని ముండకోపనిషత్తు చెప్పుచున్నది.

స గురుః పరమకృపయా అధ్యారోప అపవాద న్యాయేన ఏన ముపదిశతి

తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్
ప్రశాంత చిత్తాయ శమాన్వితాయ
యేనాక్షరం పురుషం వేద సత్యం
ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యాం ॥
(ముణ్డక 1-2-13) ఇత్యాది శ్రుతేః ॥ 31

తా॥ కృపాళువైన ఆ గురువు అధ్యారోప అపవాద న్యాయముల ద్వారా ఆ బ్రహ్మవిద్యను శిష్యునకు ఉపదేశించుచున్నాడు. అట్లు తన్నాశ్రయించిన శిష్యునకు వివేకవంతుడైన యా గురువు సత్యము, అక్షరమునైన ఆ పరబ్రహ్మ తత్త్వమును బోధించుచున్నాడు అని ముండకోపనిషత్తు చెప్పుచున్నది.

# అధ్యాయము ౨

## అధ్యారోప వివరణము

అసర్పభూతాయాం రజ్జౌ సర్పారోపవత్ వస్తుని
అవస్త్వారోపః అధ్యారోపః ॥ 32

తా॥ సర్పముకానటువంటి త్రాటియందు సర్పభావమును ఆరోపించి సర్పమువలె చూచునట్లు వస్తుభూతమైన (వాస్తవమైన) ఆత్మయందు అవస్తువగు అవాస్తవమైన అజ్ఞానమును ఆరోపించి అన్యథా చూచుట అధ్యారోపమగుచున్నది.

ఈ అధ్యారోపమే అధ్యాస యగుచున్నది. పూర్వము చూచిన రూపమును స్మరించుట చేత తదితర వస్తువునందు ఆ పూర్వదృష్టరూపమును భాసించుట అధ్యాస అని శ్రీశంకరులు నిర్వచించి యున్నారు. ఉదా: శుక్తియందు రజతము భాసించుట.

వస్తు - సచ్చిదానందమద్వయం బ్రహ్మ। అజ్ఞానాది
సకల జడసమూహోఽవస్తు॥ 33

తా॥ సచ్చిదానంద రూపమై అద్వయమైన బ్రహ్మయే వస్తువు. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" ఏకమేవ అద్వయం బ్రహ్మ "సదేవసౌమ్య ఇదమగ్ర ఆసీత్" అనియు శ్రుతివాక్యములు. అజ్ఞానాది సకల జడ ప్రపంచమున్ను అవస్తువు. ఇది తన అస్తిత్వమునకు ఇతరముపై ఆధారపడియున్నది మరియు మార్పును పొందు స్వభావము కలది.

అజ్ఞానం సదసద్భ్యామనిర్వచనీయం త్రిగుణాత్మకం జ్ఞాన విరోధి భావరూప యత్కించిదితి వదంత్యహమజ్ఞ ఇత్యాద్యనుభవాత్. "దేవాత్మ శక్తిం స్వగుణైర్నిగూఢం" (శ్వేత 1.3) ఇత్యాది శ్రుతేః॥ 34

తా॥ సత్ అనిగాని అసత్ అనిగాని చెప్పుటకు వీలులేనిదై అనిర్వచనీయమై, సత్త్వరజస్తమో గుణాత్మకమై, జ్ఞానమునకు విరోధియై భావరూపమగు ఒకానొకటి అజ్ఞానమనబడుచున్నది. "నేను అజ్ఞుడను" ఇత్యాది అనుభవముచేత నది భావరూప మగుచున్నది. "స్వగుణములచే కప్పబడిన దివ్యమైన ఆత్మశక్తిని" అని శ్రుతి వివరణము.

భావరూపము - జ్ఞానమునకు విరోధి యగుటచేత నీ అజ్ఞానము కేవలము అభావరూపమని తెలవరాదు.

## సమష్టి వ్యష్టి వివరణము

ఇదమజ్ఞానం సమష్టి వ్యష్ట్యభిప్రాయేణ ఏకమనేకమితి
చ వ్యవహ్రియతే॥ 35

తా॥ సమష్టి వ్యష్టి భేదములచే యీ అజ్ఞానము ఏకము, అనేకము అని వ్యవహారింపబడుచున్నది.

తథాహి - యథా వృక్షాణాం సమష్ట్యభిప్రాయేణ వనమిత్యేకత్వ వ్యపదేశో యథా వా జలానాం సమష్ట్యభిప్రాయేణ జలోయ ఇతి తథా నానాత్వేన ప్రతిభాసమానానాం జీవగతాజ్ఞానానాం సమష్ట్యభిప్రాయేణ తదేకత్వవ్యపదేశః "అజామేకాం" (శ్వే.ఉప.4-5) ఇత్యాదిశ్రుతేః॥ 36

తా॥ వృక్షములయొక్క సమూహమును వనము అనియు జలబిందువుల సమూహమును జలాశయమనియు సమష్టి దృష్ట్యా ఏకమని ఎట్లు వ్యవహరించుచున్నామో అదే విధముగా నానారూపములలో ప్రతిభాసించు జీవులలోని అజ్ఞానమును సమష్టి అభిప్రాయములో ఏకము అని వ్యవహరించుచున్నాము. అజాం ఏకాం - పుట్టుకలేనిది, ఏకమైనది (అజ్ఞానము) అని శ్రుతి.

ఇయం సమష్టి రుత్కృష్టోపాధితయా విశుద్ధ సత్త్వప్రధానా॥ 37

తా॥ ఈ సమష్టి శుద్ధసత్త్వగుణ ప్రధానమైనదగుటచేత ఆ శుద్ధచైతన్యమునకిది ఉత్కృష్ట ఉపాధి అని వ్యవహరింపబడు చున్నది.

ఏతదుపహితం చైతన్యం సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వ నియంతృత్వాది గుణక మవ్యక్తమంతర్యామీ

జగత్కారణమీశ్వర ఇతి చ వ్యపదిశ్యతే
సకలాజ్ఞానావభాసకత్వాత్ ।
యః సర్వజ్ఞః సర్వవిత్ (ముణ్డక 1-1-9) ఇతిశ్రుతేః॥ 38

తా॥ ఇట్టి శుద్ధ సత్త్వప్రధానమైన ఉత్కృష్ట ఉపాధి సంబంధము ద్వారా నీ చైతన్యము సమస్తమును ప్రకాశింప జేయుచున్నది. కావున దీనిని సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ, సర్వ నియంతృత్వాది గుణములు కలిగినట్టిదనియు, అవ్యక్త మనియు, అంతెర్యామియనియు, జగత్కారణమనియు, ఈశ్వరుడనియు వ్యవహరించుచున్నారు. "సర్వజ్ఞుడు సర్వవిత్ అగునట్టివాడు" అని ముణ్డకోపనిషత్తు చెప్పుచున్నది.

ఈశ్వరస్యేయం సమష్టిరఖిలకారణత్వాత్కారణశరీరమ్
ఆనందప్రచురత్వాత్ కోశవదాచ్ఛాదకత్వాచ్చ
ఆనందమయకోశః సర్వోపరమత్వాత్సుషుప్తిరతఏవ
స్థూలసూక్ష్మప్రపంచలయస్థానమితి చ ఉచ్యతే॥ 39

తా॥ ఈశ్వర సంబంధమైన యీ సమష్టిని అఖిలమునకును కారణమగుటచేత కారణశరీరమనియు, ఆనందమయమై, కత్తి వరవలె కప్పియుండుటవలన ఆనందమయకోశమనియు, సమస్తము ఇందు ఉపరమణము పొందుటచేత సుషుప్తియనియు కావుననే స్థూలసూక్ష్మ శరీరములకు లయస్థాన మనియు పేర్కొనుచున్నారు.

యథా వనస్య వ్యష్ట్యభిప్రాయేణ వృక్షా ఇత్యనేకత్వ-
వ్యపదేశోయథా వా జలాశయస్య వ్యష్ట్యభిప్రాయేణ
జలానీతి తథా అజ్ఞానస్య వ్యష్టభిప్రాయేణ తదనేకత్వ-
వ్యపదేశః "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే"
(ఋగ్వేద 6-47-18) ఇత్యాది శ్రుతేః॥ 40

తా॥ సమిష్టిదృష్ట్యా ఏకత్వమును పొందిన వనమును వ్యష్టిదృష్ట్యా వృక్షములు అని ఎట్లు అనేకముగా వ్యవహరించుచున్నామో మరియు జలాశయమును వ్యష్టి అభిప్రాయముతో జలములు అని ఎట్లు వ్యవహరించుచున్నామో అదే విధముగా అజ్ఞానమును కూడ వ్యష్టి అభిప్రాయముతో అనేక అజ్ఞానములుగా వ్యవహరించుచున్నాము. "ఆ పరమాత్మ తన మాయల ద్వారా అనేక రూపములుగా వ్యక్తమగుచున్నాడు." అని ఋగ్వేదమున్ను "య ఏకో జాలవాన్ ఈశత ఈశనీభిః - ఈ ఉత్కృష్ట ఐంద్రజాలికుడు స్వీయశక్తులతో ఏకచ్ఛత్రాధిపతిగా ఏలుచున్నాడు." అని శ్వేతాశ్వతరోపనిషత్తున్ను అజ్ఞానమునకు అనేకత్వమును చెప్పుచున్నవి.

అత్ర వ్యస్తసమస్తవ్యాపిత్వేన వ్యష్టిసమష్టితా - వ్యపదేశః ॥ 41

తా॥ ఈ వనాదులందువలె సమష్టిగత అజ్ఞానమును సమష్టియనియు వృక్షాదులందువలె వ్యష్టిగత అజ్ఞానమును వ్యష్టి అనియు వ్యవహరించుచున్నారు.

ఇయం వ్యష్టిః నికృష్టోపాధితయా మలినసత్త్వ - ప్రధానా ॥ 42

తా॥ ఈ వ్యష్టిరూప అజ్ఞానము మలినసత్త్వప్రధానమైనదై నికృష్టోపాధి యని వ్యవహరింపబడుచున్నది.

ఏతదుపహితం చైతన్యం అల్పజ్ఞత్వ అనీశ్వరత్వాది గుణకం ప్రాజ్ఞ ఇత్యుచ్యతే ఏక అజ్ఞానావభాస - కత్వాత్ ॥ 43

తా॥ ఇట్టి మలినసత్త్వ ప్రధానమైన నికృష్ట ఉపాధి సంబంధియగు చైతన్యము ఒక్క అజ్ఞానమునే భాసింపజేయుచున్నది కావున అది అనీశ్వ - రత్వ, అల్పజ్ఞత్వాది గుణములు కలదై ప్రాజ్ఞుడు అని వ్యవహరింపబడుచున్నది.

సుషుప్త్యవస్థలో నుండు జీవునకే ప్రాజ్ఞ అని పేరు. మాండూక్యోపనిషత్తులో జాగ్రత్స్వప్నసుషుప్తులను మూడవస్థలలోనుండు జీవులను క్రమముగా విశ్వ, తైజస, ప్రాజ్ఞ యని పేర్కొని యున్నారు. సుషుప్తి - యవస్థలో యీ జీవుడు తాత్కాలికముగా ఆ పరమాత్మయొక్క సన్నిధానము ననుభవించుచున్నాడు, కాని అప్పుడును అతనిని అజ్ఞానము ఆవరించియే యున్నది.

అస్య ప్రాజ్ఞత్వమస్పష్టోపాధితయానతిప్రకాశకత్వాత్ ॥

తా॥ రజస్తమో గుణములతో కూడియున్నదగుటచేత ఆ అజ్ఞానము అస్పష్టమైన ఉపాధియగుచున్నది. అట్టి అస్పష్టమైన మలిన ఉపాధికి అవభాసక సామర్థ్యము లేదు కావున ప్రజ్ఞ (ప్ర - అజ్ఞ) అనగా ప్రకృష్టమైన అజ్ఞానావృతుడగు జీవుడుగా వ్యవహరింపబడుచున్నది.

అస్యాప్యీయం అహంకారాదికారణత్వాత్ కారణశరీర మానందప్రచురత్వాత్ కోశవదాచ్ఛాదకత్వాచ్చా - నందమయకోశః సర్వోపరమత్వాత్ సుషుప్తిరత ఏవ స్థూలసూక్ష్మశరీరప్రపంచలయస్థానమితి చ ఉచ్యతే ॥ 45

తా॥ ఇట్టి ప్రాజ్ఞులకు వ్యష్టిరూప అజ్ఞానము అహంకారాదులకు కారణమగుటచేత కారణశరీరమనియు, ఆనంద ప్రాచుర్యముచేతను, కత్తి వరవలె ఆవరించి యుండుటచేతను ఆనందమయ కోశమనియు, అఖిలము

అందు ఉపశాంతి పొందుటచేత సుషుప్తి యనియు స్థూలసూక్ష్మ శరీరములకు సంబంధించిన యావత్ప్రపంచమును ఇందు లీనమగుటచేత స్థూలసూక్ష్మశరీర ప్రపంచలయస్థానమనియు చెప్పబడుచున్నది.

తదానీమేతావీశ్వరప్రాజ్ఞౌ చైతన్యప్రదీప్తాభి రతి సూక్ష్మాభిరజ్ఞానవృత్తిభిరానందమనుభవతః "ఆనందభుక్ చేతోముఖః ప్రాజ్ఞ (మాండూక్య 5) ఇతి శ్రుతేః సుఖమహమస్వాప్సం న కించిదవేదిష - మిత్యుత్థితస్య పరామర్శోపపత్తేశ్చ ॥ 46

తా॥ ఈ ఈశ్వరప్రాజ్ఞులిద్దరును ఆ సుషుప్తియందు చైతన్యము చేత ప్రకాశింపబడిన అతి సూక్ష్మమైన అజ్ఞాన వృత్తులద్వారా ఆనందము ననుభవించుచున్నారు. (ఈశ్వరపక్షములో సుషుప్తి జగత్ప్రళయ మగుచున్నది.) ప్రాజ్ఞుని పక్షములో నదియే సుషుప్తియనబడుచున్నది. ఈ రెండింటియందును అజ్ఞానము ఆవరించియే యున్నది. "చైతన్యాభిముఖుడైన ప్రాజ్ఞుడు ఆనందము ననుభవించుచున్నాడు" అని శ్రుతి మరియు "నేను సుఖముగా నిద్రపోతిని నాకేమియు తెలియలేదు" అని సుషుప్తినుండి లేచిన జీవుడు సుఖానుభవమును అజ్ఞానవృత్తిని స్మరించుటయు సరిపడుచున్నది. "సుషుప్తి కాలే సకలే విలీనే తమోఽభిభూతః సుఖరూపేతి - సుషుప్తికాలమందు సమస్తమును విలీనముకాగా తమస్సుచే ఆవృతుడై సుఖస్థితిని పొందుచున్నాడు" అని శ్రుతి.

అనయోః సమష్టివ్యష్ట్యోఃవనవృక్షయోరివ జలాశయ జలయోరివ వాభేదః ॥ 47

తా॥ వనవృక్షములకును, జలాశయజలములకును భేదము లేనట్లు ఈ సమష్టి వ్యష్టులకును భేదములేదు (అభేదము)

ఏతదుపహితయోరీశ్వరప్రాజ్ఞయోరపి వనవృక్షావచ్ఛిన్నాకాశయోరివ జలాశయజలగతప్రతిబింబాకాశయోరివ వాభేదః "ఏష సర్వేశ్వర (ఏష సర్వజ్ఞ ఏషోఽన్తర్యామ్యేష యోనిః సర్వస్య ప్రభవాప్యయౌ హి భూతానాం)" (మాణ్డూక్య-6) ఇత్యాది శ్రుతేః॥ 48

తా॥ వనమును వృక్షములను వ్యాపించిన అకాశములకును, జలాశయమందును జలమునందును ప్రతిబింబించిన ఆకాశములకును ఎట్లు భేదమున్నదో అట్లే సమష్టిసంబంధి ఈశ్వరునకును, వ్యష్టి సంబంధి జీవునకును (రెండింటి యందలి చైతన్యము ఒక్కటే కావున) అభేదమున్నది. "ఈతడే సర్వేశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి, సమస్తమునకు ఉత్పత్తి కారణము, సృష్టి లయముల కితడే కారణము" అని శ్రుతి చెప్పుచున్నది.

## తురీయ లక్షణము

వనవృక్షతదవచ్ఛిన్నాకాశయోర్జలాశయజలతద్గతప్రతిబింబాకాశయోర్వాధారభూతానుపహితాకాశవదనయో రజ్ఞాన తదుపహిత చైతన్యయోరాధారభూతం యదనుపహితం చైతన్యం తత్తురీయమిత్యుచ్యతే "(శాంతం) శివమద్వైతం చతుర్థం మన్యంతే (స ఆత్మా స విజ్ఞేయః)" (మణ్డూక్య 7) ఇత్యాది శ్రుతేః॥ 49

తా॥ వనవృక్షములను వ్యాపించిన ఆకాశములకు - జలాశయ జలగత ప్రతిబింబ ఆకాశములకును - ఆధారమై ఉపాధిరహితమైన ఒక అఖండ

ఆకాశము కలదు. అట్లే సమష్టి వ్యష్టితదుపహిత చైతన్యములకు ఆధారభూతమై, అనుపహితమైన ఒక అఖండ చైతన్యముకలదు దానినే తురీయమందురు. ఇదియే ఈశ్వరప్రాజ్ఞులకతీతమైన అఖండ స్థితి. "శాంతము శివము అద్వైతము అయిన ఆ స్థితిని నాలుగవదిగా చెప్పుచున్నారు. (జాగ్రత్ స్వప్న సుషుప్తులను మూడు అవస్థలను దాటినది గావున చతుర్థము) అదియే ఆత్మ. దానినే తెలుసుకొనవలెను" అని మాణ్డూక్యోపనిషత్తు చెప్పుచున్నది.

> ఇతమేవ తురీయం శుద్ధచైతన్యమజ్ఞానాది తదుపహిత
> చైతన్యాభ్యాం తప్తాయః పిండవత్ అవివిక్తం సన్మహా
> వాక్యస్య వాచ్యం వివిక్తం సల్లక్ష్యమితి చోచ్యతే॥ 50

తా॥ వాక్యమునకు వాఖ్యార్థము లక్ష్యార్థము అను రెండువిధముల అర్థములు గలవు. ఇచట యీ తురీయమైన చైతన్యము అజ్ఞాన తదుపహిత చైతన్యరూప సమష్టి వ్యష్టులనుండి తప్త అయఃపిండమువలె అభిన్నమైనపుడు తత్త్వమసి యను మహావాక్యమునకు వాఖ్యార్థమగుచున్నది. భిన్నమైనపుడు లక్ష్యార్థమగుచున్నది.

(మహావాక్య వివరణములో దీనిభావము విశదముగా వివరింపబడినది.)

## అజ్ఞాన భేదములు

> అస్యాజ్ఞానస్యావరణవిక్షేపనామకమస్తి
> శక్తిద్వయం ॥ 51

తా॥ ఈ అజ్ఞానమునకు ఆవరణశక్తి విక్షేపశక్తి అను రెండు శక్తులు గలవు.

> ఆవరణశక్తిస్తావదల్పోఽపి మేఘోఽనేకయోజనాయ
> తమాదిత్యమండలమవలోకయితృనయనపథపిధాయక

తయా యథాచ్ఛాదయతీవ తథాజ్ఞానం పరిచ్ఛిన్న
మప్యాత్మానమపరిచ్ఛిన్నమసంసారిణమవలోకయితృ
బుద్ధిపిధాయకతయాచ్ఛాదయతీవ తాదృశం సామర్థ్యం।
తదుక్తం - ఘనచ్ఛన్నదృష్టిర్ఘనచ్ఛన్నమర్కం యథా
మన్యతే నిష్ప్రభం చాతిమూఢః। తథాబద్ధవత్ భాతి
యో మూఢదృష్టేః స నిత్యోపలబ్ధిస్వరూపో
హమాత్మా॥" ఇతి. (హస్తామలకం 10) 52

తా॥ ఎట్లు మేఘము చిన్నదైనను చూచువాని చూపును కప్పి వేయుటచేత అనేక యోజన పర్యాప్తమైన ఆదిత్యమండలమును కప్పివేయు చున్నట్లున్నదో, అదేవిధముగా పరిచ్ఛిన్నమైన అజ్ఞానము చూచువానిబుద్ధిని కప్పివేయుటచేత అపరిచ్ఛిన్నమైన ఆత్మను కప్పివేయుచున్నట్లు తోపించు చున్నది. ఇట్టి శక్తియే ఆవరణశక్తి యగుచున్నది.

"మేఘచ్ఛన్నమైన దృష్టిగలవాడై సూర్యుడు మేఘచ్ఛన్నుడు, కాంతి లేనివాడు అయినాడని ఒక మూఢుడు ఏట్లు భావించుచున్నాడో అదే విధముగా మూఢ దృష్టికి బద్ధునివలె భావించునట్టి నిత్యముక్త - నిత్యసత్య మైన ఆ ఆత్మయే నేను." అని హస్తామలకుడు చెప్పియున్నాడు.

అనయా ఆవృతస్యాత్మనః కర్తృత్వభోక్తృత్వ సుఖిత్వ
దుఃఖిత్వాది సంసార సంభావనాపి భవతి యథా
స్వాజ్ఞానేనావృతాయాం రజ్జ్వాం సర్పత్వసంభావనా॥ 53

తా॥ ఇట్టి ఆవరణశక్తిచేత కప్పబడిన జీవరూప చైతన్యమునకు నేను కర్తను, నేను భోక్తను, నేను సుఖిని, నేను దుఃఖిని ఇత్యాది సంసార

భావన కలుగుచున్నది. తన అజ్ఞానముచేత కప్పబడిన త్రాటియందు సర్ప భావము ఎట్లు కలుగుచున్నదో అదేవిధముగా నేను సంసారినియను భావము ఆ అజ్ఞానావృతమైన జీవరూప చైతన్యమునకును కలుగుచున్నది.

విక్షేపశక్తిస్తు యథా రజ్జ్వజ్ఞానం స్వావృతరజ్జౌ
స్వశక్త్యా సర్పాదికముద్భావయత్యేవమజ్ఞానమపి
స్వావృతాత్మని స్వశక్త్యాకాశాది ప్రపంచముద్భావ
యతి తాదృశం సామర్థ్యం। తదుక్తం-
"విక్షేపశక్తిలింగాది బ్రహ్మాండాంతం జగత్ సృజేత్"
ఇతి। (వాక్యసుధా 13)॥ 54

తా॥ రజ్జు (త్రాడు) విషయకమైన అజ్ఞానము తన ఆవరణ శక్తి ద్వారా ఆ రజ్జువును ఆవరించి మరల దానియందు సర్పభ్రమను ఎట్లు కలిగించుచున్నదో అదేవిధముగా అజ్ఞానము తానావరించిన ఆత్మయందు తన శక్తిచేత ఆకాశాది ప్రపంచమును ఆరోపింపచేయు శక్తియే విక్షేపశక్తి యగుచున్నది. ఈ విక్షేపశక్తియే కారణాది బ్రహ్మాండాంతమైన జగత్తును సృష్టించుచున్నది. రజ్జు విషయక అజ్ఞానమే సర్పభావమును కలిగించినట్లు ఆత్మ విషయక అజ్ఞానమే మనకు పంచభూతాత్మక జగత్తును భాసింప జేయుచున్నది.

శక్తిద్వయవదజ్ఞానోపహితం చైతన్యం స్వప్రధానతయా
నిమిత్తం స్వోపాధిప్రధానతయోపాదానంచ భవతి ॥55

తా॥ ఇట్టి ఆవరణ విక్షేపశక్తిద్వయముతో కూడిన చైతన్యము యీ జగత్తునకు నిరుపాధిక ఆత్మదృష్ట్యా నిమిత్తకారణమున్ను, సోపాధిక ఆత్మ దృష్ట్యా ఉపాదాన కారణమున్ను అగుచున్నది.

కుమ్మరివాడు కుండను సృష్టించినట్లు ఆ పరబ్రహ్మ యీ జగత్తునకు నిమిత్త కారణము లేక పాలు పెరుగయినట్లు ఆపరబ్రహ్మనే యీ జగత్తుగా పరిణమించెనా యని పూర్వపక్షము. అయస్కాంతముయొక్క ప్రభావముచే జడమైన ఇనుము కదలునట్లు ఆత్మచైతన్య ప్రభావముచే జడమైన యీ జగత్తు కదలికగలదగుచున్నది కావున ఆత్మదృష్ట్యా చూచినపుడు యీ జగత్తునకు ఆత్మ నిమిత్తకారణమగుచున్నది. ఆ పరమాత్మ యీ జగత్తుగా మారినపుడు ఆ చైతన్యరూపము నశించుటలేదు కావున పాలుపెరుగయినట్లు యిచట పూర్వపక్షుల ప్రకారము పరిణామము కాదు. మరియు ఆ చైతన్యము జగత్తునందు అనుస్యూతముగానుండి అజ్ఞానముద్వారా ఆ చైతన్యమును స్ఫురింపజేయుచున్నది కావున యీ జగత్తు ఆత్మపరిణామము కాజాలదు. అయితే యీ జగదస్తిత్వము నెట్లు సమర్థించుట యనగా ఆ నిత్యసత్యమైన ఆత్మతత్త్వమే రజ్జువునందు సర్పము భాసించినట్లు అజ్ఞానముచే జగద్రూపములో భాసించుచున్నది. కావున యిచట వివర్తమే యగుచున్నది.

యథా లూతా తంతుకార్యం ప్రతి స్వప్రధానతయా
నిమిత్తం స్వశరీరప్రధానతయోపాదానంచ భవతి॥ 56

తా॥ సాలెపురుగు తాను కట్టెడు గూడు విషయమై తన దృష్ట్యా నిమిత్తకారణమున్ను, తన శరీరము దృష్ట్యా ఉపాదానకారణమున్ను అగుచున్నది. ఆ సాలెపురుగు తన గూటిని బాహ్యవస్తువులనపేక్షింపకయే తన శరీరము ద్వారానే ఎట్లు అల్లుచున్నదో అదేవిధముగా ఆ పరమాత్మ ఇతర వస్తు అపేక్షలేక సోపాధియగు మాయ చేతనే పిపీలికాది బ్రహ్మపర్యంతమైన యీ జగత్తును సృష్టించుచున్నాడు.

"యథోర్ణనాభిః సృజతే గృహ్యతే చ -" ఇత్యాది శ్రుతి.

తమః ప్రధానవిక్షేపశక్తిమదజ్ఞానోపహిత
చైతన్యాదాకాశ, ఆకాశాద్వాయుర్వాయో

తగ్నిరగ్నే రాపోఽద్భ్యః పృథివీ చోత్పద్యతే
"ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః"
(తై - 2.1.1) ఇత్యాది శ్రుతేః ॥ 57

తా॥ తమః ప్రధానమైనట్టి యీ విక్షేపశక్తితో కూడిన అజ్ఞానము ఉపాధిగాగల ఆ చైతన్యమునుండి ఆకాశము, ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము, జలమునుండి పృథివి ఉద్భవించినవి. "ఈ ఆత్మనుండి ఆకాశము ఉద్భవించెను" అని తైత్తరీయోపనిషత్తు చెప్పుచున్నది. మరియు, "యతో వా ఇమాని భూతాని జాయంతే" "అహంసర్వస్యప్రభవః మత్తస్సర్వం ప్రవర్తతే" ఇత్యాది ప్రమాణ వాక్యములవలన, ఆకాశాది పంచభూతములను అజ్ఞానోపహిత చైతన్యమునుండియే ఉద్భవించినవని తెలియుచున్నది.

తేషు జాడ్యాధిక్యదర్శనాత్తమఃప్రాధాన్యం
తత్కారణస్య । తదానీం సత్త్వరజస్తమాంసి
కారణగుణప్రక్రమేణ తేష్వాకాశాదిషూత్పద్యన్తే॥ 58

తా॥ ఆకాశాదులందు జడత్వమధికముగా నగపడుటచేత తత్కారణమైన అజ్ఞానోపహిత చైతన్యమునకు సృష్టిసమయమందు తమస్సే ప్రధానముగా నుండియుండెను. కారణభావము కార్యమందుండునను న్యాయముచేత సత్త్వరజస్తమోగుణములు ఆకాశాదులయందు క్రమముగా నుద్భవించినవి.

ఏతాన్యేవ సూక్ష్మభూతాని తన్మాత్రాణ్యపంచీ
కృతాని చోచ్యంతే॥ 59

తా॥ ఇట్లభివ్యక్తమైన యీ ఆకాశాదులనే సూక్ష్మభూతములనియు, తన్మాత్రలనియు, అపంచీకృతములనియు చెప్పుచున్నారు.

ఎతేభ్యః సూక్ష్మశరీరాణి స్థూలభూతాని
చోత్పద్యంతే ॥ 60

తా॥ ఈ సూక్ష్మభూతములనుండి సూక్ష్మ శరీరములు, స్థూల భూతములు ఉద్భవించినవి.

సూక్ష్మశరీర వివరణము

సూక్ష్మశరీరాణి సప్తదశావయవాని లింగశరీరాణి॥ 61

తా॥ ఈ సూక్ష్మశరీరములే లింగశరీరములు. వీనికి సప్తదశ అవయవములు గలవు.

అవయవాస్తు జ్ఞానేంద్రియపంచకం బుద్ధిమనసీ
కర్మేంద్రియ పంచకం వాయుపంచకం చేతి॥ 62

తా॥ పంచజ్ఞానేంద్రియములు, బుద్ధి మనస్సులు పంచకర్మేంద్రియములు పంచవాయువులు కలిసి పదునేడు అవయవము లగుచున్నవి.

జ్ఞానేంద్రియాణి శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణాఖ్యాని ॥

తా॥ శ్రోత్రము, త్వక్, చక్షువు, జిహ్వా, ఘ్రాణము అను నీ ఐదున్ను జ్ఞానేంద్రియములు.

ఎతాన్యాకాశాదీనాం సాత్త్వికాంశేభ్యో వ్యస్తేభ్యః
పృథక్ పృథక్ క్రమేణోత్పద్యంతే ॥ 64

తా॥ ఈ పంచ జ్ఞానేంద్రియములు క్రమంగా ఆకాశాది సత్త్వ భాగములనుండి వేర్వేరుగా ఉద్భవించినవి. ఆకాశమునుండి శ్రోత్రము,

వాయువునుండి త్వక్, అగ్నినుండి చక్షువు, జలమునుండి జిహ్వ, పృథివి నుండి ఘ్రాణము క్రమముగా ఉద్భవించినవి.

బుద్ధిర్నామ నిశ్చయాత్మికాంతఃకరణవృత్తిః ॥ 54

తా॥ బుద్ధియనగా వస్తువుయొక్క వాస్తవమును నిశ్చయింపగల అంతఃకరణ వృత్తి ॥

మనోనామ సంకల్పవికల్పాత్మికాంతఃకరణవృత్తిః ॥ 66

తా॥ మనస్సనగా సంకల్ప వికల్పాత్మకమైన అంతఃకరణవృత్తి. ఒక వస్తువును గురించి నిర్ణయించలేనప్పుడు ఇదియా అదియా అని వికల్పించునదే మనస్సు.

అనయోరేవ చిత్తాహంకారయోరంతర్భావః ॥ 67

తా॥ బుద్ధియందు చిత్తమున్ను, మనస్సునందు అహంకారమున్ను అంతర్భూతములై యున్నవి.

అనుసంధానాత్మికాంతఃకరణవృత్తిః చిత్తం ॥ 68

తా॥ పూర్వవిషయమును స్మరణకు తెచ్చునట్టి అనుసంధానరూపమైన అంతఃకరణవృత్తియే చిత్తము.

అభిమానాత్మికాంతఃకరణవృత్తిః అహంకారః ॥ 69

తా॥ నేను నాది యను అంతఃకరణవృత్తియే అహంకారము.

ఏతే పునరాకాశాదిగత సాత్త్వికాంశేభ్యో మిలితేభ్య ఉత్పద్యన్తే ॥ 70

తా॥ ఈ మనోబుద్ధ్యాదులు ఆకాశాదుల! సత్త్వాంశములయొక్క సమ్మేళనముచేత ఉద్భవించుచున్నవి.

ఏతేషాం ప్రకాశాత్మకత్వాత్ సాత్త్వికాంశ కార్యత్వం॥ 71

తా॥ ఇవి యెట్లు సాత్త్వికాంశములనుండి ఉద్భవించినవో వివరించుచున్నాడు. ఈ పంచజ్ఞానేంద్రియములు మనో బుద్ధ్యాదులు వస్తువులను ప్రకాశింపజేయునవగుటచే యివి సత్త్వాంశసంభూతము లైనవి॥

ఇయం బుద్ధిర్జ్ఞానేంద్రియైః సహితా విజ్ఞానమయకోశో భవతి ॥ 72

తా॥ జ్ఞానేంద్రియములతో కూడినదైన యీ బుద్ధి వస్తు విషయ జ్ఞానమును కలిగినదగుటచే నిది విజ్ఞానమయకోశము అవబడుచున్నది. ఆత్మను ఆవరించుటచేత కోశమగుచున్నది.

అయం కర్తృత్వభోక్తృత్వసుఖిత్వదుఃఖిత్వాద్యభి - మానత్వేనేహలోక పరలోకగామీ వ్యావహారికో జీవ ఇత్యుచ్యతే ॥ 73

తా॥ ఇది నేను కర్తను, నేను భోక్తను - నేను సుఖిని, నేను దుఃఖిని ఇత్యాది అభిమానము కలదగుటచేత ఇహలోక పరలోకములకు సంచరించుచు వ్యావహారిక జీవుడు అనబడుచున్నది.

కర్త - విజ్ఞానం యజ్ఞం తనుతే, కర్మాణి తనుతేఽపి చ - విజ్ఞానము యజ్ఞములను చేయుచున్నది మరియు సమస్తకర్మలను చేయుచున్నది అని తైత్తరీయోపనిషత్తు చెప్పుచున్నది,

వ్యావహారిక జీవుడు - పరమార్థమునకు విరుద్ధమగుటచేత వ్యావహారిక జీవుడగుచున్నాడు. పరిమాత్మ దృష్ట్యా "బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః" అను శ్రుతి ప్రకారము జీవాత్మ పరమాత్మకంటె భిన్నముకాదు. కాని మన వ్యావహారిక దృష్ట్యా చూచినపుడు జీవుడు ఇహలోక పరలోకములకు సంచరించువాడైయున్నాడు. బుద్ధిచేత నిర్ణయించి మనస్సుచేత భావించి శరీరముతో పనులు చేయుచున్నాడు. అని మనము వ్యవహరించుచున్నాము.

మనస్తు జ్ఞానేంద్రియైః సహితం సన్మనోమయకోశో భవతి ॥ 74

తా॥ జ్ఞానేంద్రియములతో కూడిన మనస్సును మనోమయకోశమని అనుచున్నారు.

కర్మేంద్రియాణి వాక్పాణిపాదపాయూపస్థాఖ్యాని ॥ 75

తా॥ వాక్కు, పాణి, పాద, పాయు, ఉపస్థలు అయిదున్ను కర్మేంద్రియము లనబడుచున్నవి.

ఏతాని పునరాకాశాదీనాం రజోంశేభ్యో
వ్యస్తేభ్యః పృథక్ పృథక్ క్రమేణోత్పద్యంతే ॥ 76

తా॥ ఈ వాక్పాణి పాదాది కర్మేంద్రియములు క్రమముగా ఆకాశాదిభూతముల రజో అంశములనుండి వేర్వేరుగా ఉద్భవించినవి.

వాయవః ప్రాణాపానవ్యానోదానసమానాః ॥ 77

తా॥ ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అనునవి పంచవాయువులు.

ప్రాణో నామ ప్రాగ్గమనవాన్నాసాగ్రస్థానవర్తీ ॥ 78

తా॥ ఊర్ధ్వముగా పోవునదై నాసాగ్రమందుండు వాయువు ప్రాణము. వాస్తవములో నీ ప్రాణము "ప్రాణః హృదయే" అను శ్రుతి ప్రకారము హృదయమందే యుండును కాని మనము దానిని నాసాగ్రమున అభివ్యక్తముగా చూడగలుగుటచేత నాసాగ్రమునందుండునది అని చెప్పియున్నారు.

అపానో నామావాగ్గమనవాన్ పాయ్వాదిస్థానవర్తీ॥ 79

తా॥ అధోగమనము కలదై పాయ్వాదుల యందుండు వాయువు అపానము.

వ్యానో నామ విష్వగ్గమనవానఖిలశరీరవర్తీ ॥ 80

తా॥ సర్వతోముఖముగా సంచరించునదై సమస్త శరీరమును వ్యాపించియుండునది వ్యానము.

ఉదానో నామ కంఠస్థానీయ ఉర్ధ్వగమనవాన్
ఉత్క్రమణ వాయుః ॥ 81

తా॥ సూక్ష్మశరీరము దేహత్యాగము చేసి పైకిపోవుటకు మార్గమై కంఠమందుండు వాయువు ఉదానము.

సమానో నామ శరీరమధ్యగతాశితపీతాన్నాది
సమీకరణకరః ॥ 82

తా॥ ఆహారపానీయములను సమీకరింపజేయునది సమానము. ఇది శరీరమధ్యమందుండును.

సమీకరణంతు పరిపాకకరణం రసరుధిరశుక్ర
పురీషాది కరణమితి యావత్ ॥ 83

తా॥ ఆహారమును జీర్ణింపజేసి రక్తముగా రస శుక్రములుగాను పురీషాదులుగను మార్చుట సమీకరణము.

వాస్తవములో యీ పంచవాయువులును ఒక్కటే అయినను వాని వాని కార్యభేదము చేత నామభేదము కలిగి పంచధా భిన్నమైనవి.

కేచిత్తు నాగకూర్మకృకలదేవదత్త ధనంజయాఖ్యాః
పంచాన్యే సన్తీతి వదంతి ॥ 84

తా॥ కొంతమంది సాంఖ్యమతస్థులు నాగ, కూర్మ, కృకల, దేవదత్త, ధనంజయము లని మరి అయిదు వాయువులున్నవని చెప్పుచున్నారు.

తత్ర నాగ ఉద్గిరణకరః । కూర్మ ఉన్మీలనకరః ॥
కృకలః క్షుత్ కరః । దేవదత్తో జృంభణకరః ।
ధనంజయః పోషణకరః ॥ 85

తా॥ నాగము వమనమును కలిగించునది. కూర్మము కనురెప్ప పాటును, కృకలము తుమ్మును కలిగించునవి. దేవదత్తము ఆవులింతను, ధనంజయము శరీరపుష్టిని కలిగించునవై యున్నవి. ఇందు ధనంజయమను వాయువు ప్రాణి మరణించినను ఆ శరీరమును వదలక అంతటా వ్యాపించియే యుండును.

ఏతేషాం ప్రాణాదిష్వంతర్భావాత్ ప్రాణాదయః
పంచైవేతి కేచితూ ॥ 86

తా॥ ఈ నాగము మొదలైన వాయువులు ప్రాణాదులలో అంతర్భూతములగుటచే ప్రాణములు అయిదే అని వేదాంతులు చెప్పుచున్నారు.

ఏతత్ప్రాణాదిపంచకమాకాశాదిగతరజోంశేభ్యో
మిలితేభ్య ఉత్పద్యంతే ॥ 87

తా॥ ప్రాణాదులయిన యీ పంచవాయువులు ఆకాశాది పంచభూతములయొక్క రజోంశములన్నియు కలియుటవలన ఉద్భవించుచున్నవి.

ఇదం ప్రాణాదిపంచకం కర్మేంద్రియైః సహితం సత్
ప్రాణమయ కోశో భవతి। అస్యక్రియాత్మకత్వేన
రజోంశకార్యత్వం ॥ 88

తా॥ ఈ ప్రాణాది పంచకము కర్మేంద్రియములతో కూడినదై ప్రాణమయకోశమగుచున్నది. ఇది క్రియాత్మకమగుటచేత రజోంశమువలన ఉద్భవించినదని చెప్పబడుచున్నది.

ఏతేషు కోశేషు మధ్యే విజ్ఞానమయో జ్ఞానశక్తిమాన్
కర్తృరూపః। మనోమయ ఇచ్ఛాశక్తిమాన్ కరణరూపః।
ప్రాణమయః క్రియాశక్తిమాన్ కార్యరూపః।
యోగ్యత్వాదేవమేతేషాం విభాగ ఇతి వర్ణయంతి।
ఏతత్ కోశత్రయం మిళితం సత్ సూక్ష్మశరీర
మిత్యుచ్యతే ॥ 89

తా॥ ఈ కోశములందు విజ్ఞానమయకోశము జ్ఞానశక్తిగల కర్తయగుచున్నది. మనోమయకోశము ఇచ్ఛాశక్తిగల కరణమగుచున్నది. ప్రాణ

మయకోశము క్రియాశక్తిగల కార్యరూపమగుచున్నది. ఈ మూడు కోశము లను ఆయాకార్యముల ననుసరించి యీ విధముగా విభజించియున్నారు. ఈ మూడున్ను కలిసి సూక్ష్మశరీరమగుచున్నది.

బుద్ధి ఆత్మకు సన్నిహితముగా నుండుటచేత విజ్ఞానమయ కోశమగు చున్నది. జ్ఞాత జ్ఞానేంద్రియములున్నను మనస్సులేకున్న విషయములను గ్రహించలేడు కావున మనస్సు (మనోమయకోశము) కరణమగుచున్నది. "వాక్కు మనస్సు ఐక్యమునుపొందెను. అందుండి ప్రాణము ఉద్భవించినది." అని బృహదారణకోపనిషత్తు. కావున ప్రాణమయకోశము క్రియాత్మక మగుచున్నది.

అత్రాప్యఖిలసూక్ష్మశరీరమేకబుద్ధివిషయతయా వనవత్
జలాశయవద్వా సమష్టిరనేక బుద్ధి విషయతయా
వృక్షవజ్జలవద్వావ్యష్టిరపి భవతి ॥ 90

తా॥ ఈ సూక్ష్మశరీర విషయమందు కూడ సమస్త సూక్ష్మశరీరము లనుబట్టి వనమువలె జలాశయమువలె సమష్టియు, ఏకసూక్ష్మశరీరాపేక్షయా వృక్షము, జలబిందువువలె వ్యష్టియు అనెడి సమష్టివ్యష్టివ్యవహారముకలదు. ఇట్టి సమష్టి సూక్ష్మశరీరమును హిరణ్యగర్భుడనియు, వ్యష్టిసూక్ష్మశరీరమును తైజసుడనియు పేర్కొనుచున్నారు.

ఏతత్ సమష్ట్యుపహితం చైతన్యం సూత్రాత్మా
హిరణ్యగర్భః ప్రాణశ్చేత్యుచ్యతే సర్వత్రాను
స్యూతత్వాత్ జ్ఞానేచ్ఛా క్రియాశక్తి
మదుపహితత్వాచ్చ ॥ 91

తా॥ ఇట్టి సూక్ష్మశరీరసమష్టిచే ఆవరింపబడిన చైతన్యము జ్ఞాన ఇచ్ఛాక్రియాశక్తులుటలదై అపంచీకృతభూతాత్మ యగుటచేత దానిని

హిరణ్యగర్భ, సూత్రాత్మ, ప్రాణః, ప్రజాపతి ఇత్యాది నామములచే పేర్కొనుచున్నారు.

సమస్త జగత్తునందును పూసలలో దారమువలె నుండుటచే సూత్రాత్మయనియు, సమస్త క్రియాత్మకమగుటచే ప్రాణమనియు, సృజనశక్తి కలదగుటచే ప్రజాపతి యనియు అనేకవిధములైన నామములు కలిగి యున్నది.

అస్యైషా సమష్టిః స్థూలప్రపంచాపేక్షయా
సూక్ష్మత్వాత్ సూక్ష్మశరీరం విజ్ఞానమయాది
కోశత్రయం జాగ్రద్వాసనామయత్వాత్ స్వప్నోఽత
ఎవ స్థూలప్రపంచలయస్థానమితి చోచ్యతే॥ 92

తా॥ ఈ హిరణ్యగర్భరూపమైన సమష్టి స్థూలప్రపంచముకంటె సూక్ష్మమగుటచేత సూక్ష్మశరీరమనియు, విజ్ఞానాదికోశత్రయరూపమైన యీ సూక్ష్మశరీరము జగద్వాసనలు కలదగుటచేత స్వప్నమనియు, స్థూలప్రపంచమునకు లయస్థానమనియు చెప్పబడుచున్నది. స్థూలశరీరముద్వారా జాగ్రదవస్థలో కలుగు అనుభవములే సూక్ష్మశరీరముద్వారా స్వప్నమందు భావరూపములో అనుభూతములగుచున్నవి.

ఏతత్ వ్యష్ట్యుపహితం చైతన్యం తైజసో భవతి
తేజోమయాంతఃకరణోపహితత్వాత్ ॥ 93

తా॥ వ్యష్టియైన సూక్ష్మశరీరమందలి చైతన్యము తేజోమయ అంతఃకరణముచే ఆవృతమైనది కావున తైజసుడు అనబడుచున్నది.

అస్యాపీయం వ్యష్టిః స్థూలశరీరాపేక్షయా
సూక్ష్మత్వాదితి హేతోరేవ సూక్ష్మశరీరం

విజ్ఞానమయాది కోశత్రయం జాగ్రద్వాసనా
మయత్వాత్ స్వప్నోఽత ఏవ స్థూలశరీరలయస్థానమితి
చోచ్యతే ॥ 94

తా॥ వ్యష్టిరూప యీ తైజసుడు స్థూలశరీరాపేక్షయా సూక్ష్మ
మగుటచే సూక్ష్మశరీరమనియు, విజ్ఞానాదికోశత్రయ రూపమైన యీ
సూక్ష్మశరీరము జాగ్రద్వాసనలతో కూడియుండుటచేత స్వప్నమనియు,
కావుననే స్థూలశరీర లయస్థానమనియు చెప్పబడుచున్నాడు.

ఏతౌ సూత్రాత్మతైజసౌ తదానీం మనోవృత్తిభిః
సూక్ష్మవిషయాననుభవతః "ప్రవివిక్తభుక్ తైజసః"
(మణ్డూక్య-3) ఇత్యాది శ్రుతేః ॥ 95

తా॥ ఈ సూత్రాత్మ తైజసులు ఆ స్వప్నావస్థయందు మనోవృత్తుల
ద్వారా సూక్ష్మవిషయములను అనుభవించుచున్నారు. స్వప్నమందు చూచు
గజతురగాదులు దేశకాలాదులు జాగ్రత్తలో లేకపోవుటచే అవి వాస్తవము
కాదు. మరియు అవి కేవలము స్మృతిమాత్రము కాదు వానిని మనస్సుచే
స్పష్టముగా చూచుచున్నాము కావున. సుషుప్తి అవస్థలో యందువలెగాక
ఇందు విషయములను చూచుచున్నాము కనుక ఇది సుషుప్తియు కాదు
కావున స్వప్నములోని విషయములు ప్రాతిభాసిక మాత్రములై సూక్ష్మములై
యున్నవి. వానినే జీవుడు తైజసరూపములో అనుభవించుచున్నాడు.

అత్రాపి సమష్టివ్యష్ట్యోః తదుపహిత సూత్రాత్మతైజస
యోః వనవృక్షవత్తదవచ్ఛిన్నాకాశవచ్చ జలాశయ
జలవత్తద్గతప్రతిబింబాకాశవచ్చాభేదః ॥ 96

తా॥ వనవృక్షములందు వ్యాపించిన ఆకాశములకెట్లభేదమో జలాశయ జలములందు ప్రతిబింబించిన ఆకాశములకెట్లభేదమో అట్లే సమష్టివ్యష్టి ఉపాధిగత చైతన్యరూపమగు సూత్రాత్మ తైజసులకును అభేదము,

ఎవం సూక్ష్మశరీరోత్పత్తిః ॥ 97

తా॥ ఇదియే సూక్ష్మశరీర ఉత్పత్తి క్రమము.

స్థూలభూతాని తు పంచీకృతాని ॥ 98

తా॥ పంచీకృతములగు సూక్ష్మభూతములే స్థూలభూతములగు చున్నవి.

పంచీకరణం త్వాకాశాదిపంచస్వేకైకం ద్విధా సమం విభజ్య తేషు దశసు భాగేషు ప్రాథమికాన్ పంచ భాగాన్ ప్రత్యేకం చతుర్ధా సమం విభజ్య తేషాం చతుర్ణాంభాగానాం స్వస్వద్వితీయార్ధ భాగపరిత్యాగేన భాగాంతరేషు యోజనం ॥ 99

తా॥ ఆకాశాది పంచభూతములను రెండుగా విభజించవలెను. ఇట్లు విభక్తమైన దశవిభాగములలోను మొదటి అయిదింటిని నాలుగుగా విభజించ వలెను. ఆ నాలుగింటిని స్వీయ అర్ధభాగములను విడచిపెట్టి ఇతరములయొక్క రెండవభాగములతో చేర్చవలెను.

ఉదా:—ఆకాశమును రెండుగా విభజించి అందులో ద్వితీయ అర్ధభాగమును నాలుగుగా విభజించవలయును. ఆ నాలుగు ఆకాశభాగ ములను వాయువు, అగ్ని, జల, పృథివీ అను నీ నాలుగు భూతముల అర్ధ భాగములతో కలపవలయును. అంత వాయువు మొదలైన నాలుగుభూత

ములకును తమ అర్ధ భాగములతోపాటు ఎనిమిదవవంతు ఆకాశభాగము చేరుచున్నది.

ఆకాశము 8 భాగములు

అందు ఆకాశము - 4 భాగములు

వాయువు - 1 భాగము

అగ్ని - 1 భాగము

జలము - 1 భాగము

పృథివీ - 1 భాగము

ఇట్లు పంచీకృతమైన ఆకాశమందు సగము ఆకాశలక్షణమున్ను మిగతా సగములో వాయ్వాది లక్షణములున్ను కూడియున్నవని భావము. దీనినే పంచీకరణమందురు.

తదుక్తం—

ద్విధా విధాయ చైకైకం చతుర్ధా ప్రథమం పునః ॥
స్వస్వేతర ద్వితీయాంశైర్యోజనాత్ పంచ పంచ తే"
ఇతి ॥ 100

తా॥ ఒక్కొక్క భూతమును రెండుగా విభజించి అందు ప్రథమ విభాగమును నాలుగుగా విభజించి ఆ నాలుగు భాగములను తమకంటె యితరమైన నాలుగుభూతములందు చేర్చుటచే ఒక్కొక్కటి పంచవిభాగములుగల ఒక భూతమగుచున్నది.

అస్యాప్రామాణ్యం నాశంకనీయం త్రివృత్కరణశ్రుతేః
పంచీకరణస్యాప్యుపలక్షణత్వాత్ ॥ 101

తా॥ ఛాందోగ్యోపనిషత్తులో "భగవంతుడు ముందుగా అగ్నిజలభూములను మూడింటిని సృష్టించెను. వానిని త్రివృత్కరణవిధానములో ఒకదానితో నొకటి కలిపెను." అని ఉన్నది. కావున త్రివృత్కరణవే శ్రుతిలో చెప్పబడినది కాని పంచీకరణము శ్రుతి చేత చెప్పబడలేదు. అందువలన యీ పంచీకరణము అప్రమాణమని శంకింపరాదు. ఏలనన ఆ త్రివృత్కరణ ప్రతియే యీ పంచీకరణమునకు ఉపలక్షణమై యున్నది.

పంచానాం పంచాత్మకత్వే సమానేఽపి తేషు చ
విశేషాత్తు "తద్వాదస్తద్వాదః" (బ్ర. సూ. 2-4-22)
ఇది న్యాయేనాకాశాది వ్యపదేశః సంభవతి ॥ 102

తా॥ పంచభూతములలోను పంచీకరణద్వార ఇతర భూతాంశములున్నను ఆ యా భూతములయొక్క ప్రాధాన్యముచేత ఆకాశాది నామములు వానికి సార్థకమైనవి. ఒక ప్రత్యేక భూతముయొక్క ప్రాధాన్యముచే ఆ పేరు ఆ భూతమునకీయబడినదని బ్రహ్మసూత్రము చెప్పుచున్నది. అనగా ఏ భూతమునందు యే భూతముయొక్క ఎక్కువభాగము కలదో ఆ పేరే దానికి కలిగినది.

తదానీమాకాశే శబ్దోఽభివ్యజ్యతే వాయౌ శబ్ద
స్పర్శావగ్నౌ శబ్దస్పర్శరూపాణ్యప్సు శబ్దస్పర్శరూపరసాః
పృథివ్యాం శబ్దస్పర్శరూపరసగంధాశ్చ ॥ 103

తా॥ ఇట్లు పంచీకరణము చేయుటచేత ఆకాశమందు శబ్దమున్ను, వాయువునందు శబ్దస్పర్శలున్ను, అగ్నియందు శబ్దస్పర్శరూపములున్ను జలమందు శబ్దస్పర్శరూపరసములున్ను, పృథివియందు శబ్దస్పర్శరూపరసగంధములున్ను అభివ్యక్తమగుచున్నవి.

ఏతేభ్యః పంచీకృతేభ్యః భుతేభ్యః భూర్భువఃస్వర్మహ
ర్జన స్తపః సత్య మిత్యేతన్నామకానాముపర్యుపరి
విద్యమానానాం అతల వితలసుతల రసాతల తలాతల
మహాతల పాతాలనామకానామధోఽదో
విద్యమానానాం లోకానాం బ్రహ్మాండస్య తదంతర్గత
చతుర్విధ స్థూలశరీరాణాం తదుచితానామన్నపానా
దీనాం చోత్పత్తి ర్భవతి ॥ 104

తా॥ ఈ విధముగా పంచీకృతములైన పంచభూతములనుండి భూః - భువః - స్వః - మహః - జనః - తపః - సత్యం అనెడు సప్త ఊర్ధ్వలోకములున్న. అతల - వితల - సుతల - రసాతల - తలాతల - మహాతల పాతాలము లనెడు సప్త అధోలోకములున్న ఈ బ్రహ్మాండమున్న, అందుగల చతుర్విధ స్థూలశరీరములున్న, వానికి కావలసిన అన్నపానాదులును ఉద్భవించినవి.

చతుర్విధ శరీరాణి తు జరాయుజాండజస్వేదజ
ఉద్భిజ్జాఖ్యాని ॥ 105

తా॥ ఈ నాలుగువిధములైన స్థూలశరీరములు - జరాయుజములు - అండజములు - స్వేదజములు - ఉద్భిజములు.

జరాయుజాని - జరాయుభ్యో జాతాని - మనుష్య
పశ్వాదీని ॥ 106

తా॥ మావిచే కప్పబడి పుట్టినవి జరాయుజములు. మనుష్యులు - పశువులు మొదలైనవి.

అండజాన్యండేభ్యో జాతాని పక్షిపన్నగాదీని ॥ 107

తా॥ అండమునుండి పుట్టునట్టి పక్షులు, పాములు మొదలగునవి అండజములు.

స్వేదజాని స్వేదేభ్యో జాతాని యూకమశకాదీని ॥ 108

తా॥ స్వేదమునుండి పుట్టు పేలు, దోమలు మొదలగునవి స్వేదజములు.

ఉద్భిజ్జాని భూమిముద్భిద్య జాతాని లతావృక్షాదీని॥ 109

తా॥ భూమిని చీల్చుకొనివచ్చు లతలు, వృక్షములు మొదలగునవి ఉద్భిజములు.

అత్రాపి చతుర్విధ సకల స్థూలశరీరమేకానేక
బుద్ధివిషయతయా వనవజ్జలాశయవద్వా సమష్టిః
వృక్షవజ్జలవద్వా వ్యష్టిరపి భవతి ॥ 110

తా॥ ఈ స్థూలశరీరములున్ను ఏక అనేక బుద్ధి విషయములగుటచే వనవృక్షములవలెను, జలాశయ జలములవలెను సమష్టివ్యష్టి యగుచున్నవి.

ఏతత్ సమష్ట్యుపహితం చైతన్యం వైశ్వానరో
విరాడిత్యుచ్యతే సర్వనరాభిమానిత్వాద్వివిధం
రాజమానత్వాచ్చ ॥ 111

తా॥ ఈ సమష్టి స్థూలశరీరముతోకూడిన చైతన్యము విరాట్, వైశ్వానరః అనబడుచున్నది. సమస్తనరాభిమానము (అనగా సమస్త స్థూల శరీరములు తనవే అనుకొనుటచేత) కలవాడగుటచేత వైశ్వానరుడును, వివిధముగా ప్రకాశించుటచేత విరాట్ అనిన్నీ అనబడుచున్నాడు.

అస్యైషా సమష్టిః స్థూలశరీరమన్నవికారత్వా
దన్నమయకోశః స్థూలభోగాయ తనత్వాచ్చ
స్థూలశరీరం జాగ్రదితి చ వ్యపదిశ్యతే ॥ 112

తా॥ విరాట్ యొక్క యీ స్థూలశరీరము అన్నముయొక్క వికారమగుటచేత అన్నమయకోశమనియు స్థూల విషయ భోగములకు స్థానమగుటచే స్థూలశరీరమనియు జాగ్రత్తు అనియు చెప్పబడుచున్నది.

ఏతద్వ్యష్ట్యుపహితం చైతన్యం విశ్వ ఇత్యుచ్యతే
సూక్ష్మ శరీరాభిమానమపరిత్యజ్య స్థూలశరీరాది
ప్రవిష్టత్వాత్ ॥ 113

తా॥ వ్యష్టిరూప స్థూలశరీరగత చైతన్యము విశ్వుడనబడుచున్నది. సూక్ష్మశరీరాభిమానమును పరిత్యజించకుండనే యీ స్థూలశరీరమందు ప్రవేశించుటచేత విశ్వుడనబడుచున్నాడు. ఈ ప్రత్యగాత్మ కారణ సూక్ష్మ స్థూలశరీరాద్యభిమానము వహించినపుడు ప్రాజ్ఞ తైజస విశ్వులను నామములను క్రమముగా పొందుచున్నాడు.

అస్యాప్యేషా వ్యష్టిః స్థూలశరీరమన్నవికారత్వాదేవ
హేతోరన్నమయకోశో జాగ్రదితి చోచ్యతే ॥ 114

తా॥ ఈ జీవునియొక్క వ్యష్టిస్థూలశరీరము అన్నవికారమగుటచేత అన్నమయకోశమనియు, తన అస్తిత్వమునే తెలిసికొనగలుగుటచేత జాగ్రదవస్థయనియు పేర్కొనబడుచున్నది.

తదానీమేతౌ విశ్వవైశ్వానరౌ దిగ్వాతార్కవరుణాశ్విభిః
క్రమాన్నియన్త్రితేన శ్రోత్రాదీంద్రియపంచకేన

క్రమాచ్ఛబ్దస్పర్శరూపరసగంధానగ్నీంద్రోపేంద్రయమ
ప్రజాపతిభిః క్రమాన్నియంత్రితేనవాగాదీంద్రియపంచ
కేన క్రమాద్వచనా దానగమన విసర్గానందాంశ్చంద్ర
చతుర్ముఖ శంకరాచ్యుతైః క్రమాన్నియంత్రితేన
మనోబుద్ధ్యహంకార చిత్తాఖ్యేన అంతరింద్రియ
చతుష్కేణ క్రమాత్ సంకల్ప నిశ్చయా
హంకార్యచైత్తాంశ్చ సర్వానేతాన్ స్థూలవిషయానను
భవతః "జాగరితస్థానోబహిః ప్రజః" (మాణ్డూక్య-3)
ఇత్యాది శ్రుతేః ॥ 115

తా॥ విశ్వవైశ్వానరులు బాహ్యాభ్యంతర జగత్తును ఎట్లు అనుభవించు చున్నారను విషయమును వివరించుచున్నారు. విశ్వవైశ్వానరులు జాగ్రదవస్థ యందు - దిక్కు - వాయువు - అర్క - వరుణ - అశ్వినీ దేవతలచేత నియమింపబడిన శ్రోత్ర - త్వక్ - చక్షు - జిహ్వ - ఘ్రాణ అను పంచేంద్రియములద్వారా శబ్ద - స్పర్శ - రూప - రస గంధములను; అగ్ని - ఇంద్ర - ఉపేంద్ర - యమ - ప్రజాపతులచేత అధిష్టింపబడిన వాక్ - పాణి - పాద - పాయు - ఉపస్థలను పంచకర్మేంద్రియములద్వారా వచన - ఆదాన - గమన - విసర్గ - ఆనందములను; చంద్ర - చతుర్ముఖ - శంకర - అచ్యుతులచేత అధిష్టింపబడినమనో - బుద్ది - అహంకార - చిత్తములను నాలుగు అంతరింద్రియములద్వారా సంకల్ప - నిశ్చయ - అహంకార్య - చిత్తసంబంధ స్మృతులను; ఇట్టి యీ సర్వవిధ బాహ్యవిషయములను అనుభవించుచున్నారు. "ఆ ఆత్మ జాగ్రదవస్థయందున్నదై బాహ్య విషయజ్ఞానము కలదగుచున్నది." అని మాండూక్యోపనిషత్తు చెప్పు చున్నది.

అత్రాప్యనయోః స్థూలవ్యష్టిసమష్ట్యో స్తదుపహిత
విశ్వవైశ్వానరయోశ్చ వనవృక్షవ త్తదవచ్ఛిన్నాకాశ
వచ్చజలాశయ జలవ త్తద్గత ప్రతిబంబాకాశవచ్చ
పూర్వవదభేదః ॥ 116

తా॥ ఇచటకుడ స్థూలమైన వ్యష్టి సమష్టిరూపులగు నీ విశ్వవైశ్వానరులకు వృక్షగత వనగత ఆకాశములవలెను, జలప్రతిబింబ జలాశయప్రతిబింబ ఆకాశములవలెను అభేదము.

ఏవం పంచీకృత పంచభూతేభ్యః స్థూలప్రపంచోత్పత్తిః॥

తా॥ ఇట్లు పంచీకరణము చేయబడిన పంచభూతములనుండి స్థూల ప్రపంచము ఉద్భవించినది.

### అధ్యారోపముయొక్క పరిమితి

ఏతేషాం స్థూలసూక్ష్మకారణప్రపంచానామపి
సమష్టిరేకో మహాన్ ప్రపంచో భవతి
యథావాన్తరవనానాం సమష్టిరేకం మహద్వనం భవతి
యథావాన్తర జలాశయానాం సమష్టిరేకో
మహాన్ జలాశయః ॥ 118

తా॥ అవాంతర వనములయొక్క సమష్టి ఎట్లు మహావనమగుచున్నదో, అవాంతర జలాశయములయొక్క సమష్టి మహాజలాశయమగుచున్నదో అట్లే ఈ స్థూలసూక్ష్మకారణ ప్రపంచములకుకూడ సమష్టిరూపమైన ఒక మహాప్రపంచము కలదు.

ఏతదుపహితం వైశ్వానరాదీశ్వరపర్యంతం చైతన్య
మప్యవాంతరవనావచ్ఛిన్నాకాశవదవాంతరజలాశయ
గత ప్రతిబింబాకాశవచ్చైకమేవ ॥ 119

తా॥ అవాంతర వనవ్యాప్త ఆకాశమువలెను. అవాంతరజలాశయగత ప్రతిబింబ ఆకాశమువలెను ఈ మహాప్రపంచగత వైశ్వానరాది ఈశ్వర పర్యంతమైన చైతన్యముకూడ ఒక్కటే యగుచున్నది.

ఆభ్యాం మహాప్రపంచ తదుపహితచైతన్యాభ్యాం
తప్తాయః పిండవదవివిక్తం సదనుపహితం చైతన్యం
"సర్వం ఖల్విదం బ్రహ్మ" (ఛాందోగ్య - 3-14-1)
ఇతి (మహా) వాక్యస్య వాచ్యం భవతి, వివిక్తం
సల్లక్ష్యమపి భవతి ॥ 120

తా॥ ఎఱ్ఱగా కాలిన ఇనపగుండునందు ఇనుముతో ఐక్యము చెందిన అగ్నివలె మహాప్రపంచ తద్గత చైతన్యములకు ఐక్యభావమును చెప్పవలసి వచ్చినపుడు "సర్వం ఖలు ఇదం బ్రహ్మ" అను వాక్యమునకు ఈ చైతన్యము వాచ్యార్థమగుచున్నది. వేరుగా చెప్పినయెడల ఆ మహావాక్యమునకిది లక్ష్యార్థమగుచున్నది.

ఏవం వస్తున్యవస్త్వారోపోఽధ్యారోపః సామాన్యేన
ప్రదర్శితః ॥ 121

తా॥ ఈ విధముగా వస్తువుయందు అవస్తువును ఆరోపించుట అను అధ్యారోపమును సామాన్యముగా వివరించడమైనది.

# అధ్యాయము 3

## జీవుడు - అధ్యారోపము

### చార్వాకులు

ఇదానీం ప్రత్యగాత్మనీదమిదమయమయమారోప
యతీతి విశేషత ఉచ్యతే ॥ 122

తా॥ ఇప్పుడు ఇదియే ఆత్మ, ఇదియే ఆత్మ అని ఆ ప్రత్యగాత్మ యందు ఆ యా తత్త్వముల నారోపించు వివిధమతస్థుల వాదనలను వివరించు చున్నారు.

అతిప్రాకృతస్తు "ఆత్మా వై జాయతే పుత్రః" -
ఇత్యాది శ్రుతేః స్వస్మిన్నివ పుత్రేఽపి ప్రేమదర్శనాత్
పుత్రే పుష్టే నష్టే చాహమేవపుష్టో నష్టశ్చేత్యాద్యను
భవాచ్చ పుత్ర ఆత్మేతి వదతి ॥ 123

తా॥ ఆత్మయే పుత్రుడుగా జన్మించుచున్నాడు అని శ్రుతివచనము కలదు. మరియు ఒకనికి తన పుత్రునియందు ప్రేమకలిగియుండుట తెలియు చున్నది. అందుచేతనే పుత్రుడు పుష్టినందగా తాను పుష్టినందితిననియు పుత్రుడు నశించగా తాను నశించితిననియు భావించుచున్నాడు కావున పుత్రుడే ఆత్మయని చార్వాకులలోని అతిప్రాకృతులను తెగవారు చెప్పు చున్నారు.

ఇచట శ్రుతి ప్రమాణము, యుక్తి, అనుభవము అను మూడింటిద్వారా వీరు తమ వాదనను నిరూపించుచున్నారు. పుత్రుడే ఆత్మ అనునది శ్రుతి

వచనము పుత్రునియందు ప్రేమకలుగుటవలన అనునది యుక్తి. పుత్రుడు పుష్టి నొందగా తాను పుష్టినొందితిననియు, పుత్రుడు నశించగా తాను నశించితి ననియు భావించుట అనుభవము.

ఇదేవిధముగా ఇతరవాదనలలో చూడనగును.

చార్వాకస్తు "సవా ఏష పురుషోఽన్నరసమయః" (తై. 2-1-1) ఇత్యాదిశ్రుతేః ప్రదీప్తగృహాత్ స్వపుత్రం పరిత్యజ్యాపి స్వస్య నిర్గమదర్శనాత్ స్థూలోఽహం కృశోఽహమిత్యనుభవాచ్చ స్థూలశరీరమాత్మేతి వదతి ॥ 124

తా॥ అ యీ పురుషుడు అన్నమయుడు అని శ్రుతివచనము. నిప్పంటుకున్న గృహమునుండి తన పుత్రుని కూడ పదలి తాను పరుగెత్తి పోవుట లోకములో కనబడుచున్నది. పైగా నేను స్థూలముగానున్నాను. కృశుడనైయున్నాను" ఇత్యాది అనుభవము కలుగుటచేత స్థూలశరీరమే ఆత్మయని చార్వాకులు చెప్పుచున్నారు.

అపరశ్చార్వాకః తే హ ప్రాణాః ప్రజాపతిం పితర మేత్యోచుః (ఛాందోగ్య-5-1-7) ఇత్యాది శ్రుతేరింద్రియాణామభావే శరీరచలనాభావాత్ కాణోఽహం బధిరోఽహమిత్యాద్యనుభవాచ్చేంద్రియాణ్యాత్మేతి వదతి ॥ 125

తా॥ అ ఇంద్రియములు తండ్రియైన ప్రజాపతిని చేరి యిట్లు పలికెను" అని శ్రుతివచనము ఇంద్రియములు లేకున్న శరీరము కదలనుకూడ కదలలేదు.

మరియు నేను చెవిటివానిని, నాకు ఒక కన్ను గ్రుడ్డి" ఇత్యాది అనుభవము కలుగుచున్నది కావున ఇంద్రియములే ఆత్మయని మరియొక తెగ చార్వాకులు చెప్పుచున్నారు.

అపరశ్చార్వాకః "అన్యోఽన్తర ఆత్మా ప్రాణమయః" (తై. 2-2-1) ఇత్యాది శ్రుతేః ప్రాణాభావ ఇంద్రియాది చలనాయోగాదహమశనాయావానహం పిపాసావానిత్యాది అనుభవాచ్చ ప్రాణ ఆత్మేతి వదతి ॥ 126

తా॥ ఈ దేహముకంటె భిన్నమై దేహాంతర్గతమైన ప్రాణమే ఆత్మయని శ్రుతి వచనము, ప్రాణములేనిన్న ఇంద్రియాదులు పనిచేయలేవు కావునను, నేను ఆకలిగొనియున్నాను, నేను దాహముకొనియున్నాను అను అనుభవము కలుగుటచేతను ప్రాణమే ఆత్మ యని చార్వాకులలో మరియొక తెగవారు చెప్పుచున్నారు.

అన్యస్తు చార్వాకః "అన్యోఽన్తర ఆత్మామనోమయః" (తై - 2-3-1) ఇత్యాది శ్రుతేర్మనసి సుప్తే ప్రాణాదే రభావాదహం సంకల్పవానహం వికల్పవానిత్యాద్యను భవాచ్చ మన ఆత్మేతి వదతి ॥ 127

తా॥ ఈ దేహప్రాణములకంటె భిన్నమై, వీనికి అంతర్గతమైయుండు మనస్సే ఆత్మయని శ్రుతివచనము, మనస్సు సుషుప్తియందు నిద్రించునపుడు ప్రాణాదులు నిష్క్రియములగుచున్నవి. కావునను, నేను సంకల్పించుచున్నాను, నేను వికల్పించుకొనుచున్నాను అను అనుభవము కలుగుట చేతను మనస్సే ఆత్మయని చార్వాకులలో మరియొక తెగవారు చెప్పుచున్నారు.

బౌద్ధుల వాదము

బౌద్ధస్తు "అన్యోఽన్తర ఆత్మా విజ్ఞానమయః" (తై - 2-4-1) ఇత్యాదిశ్రుతేః కర్తురభావే కరణస్య శక్త్యభావాదహం కర్తాహం భోక్తేత్యాద్యనుభవాచ్చ బుద్ధిరాత్మేతి వదతి ॥ 128

తా॥ దేహప్రాణ మనస్సులకంటె భిన్నమై తదంతర్గతమైన విజ్ఞానమే ఆత్మ యని శ్రుతివచనము. కర్తలేకున్న కరణమగు మనస్సునకు శక్తి లేక పోవుటవలనను నేను కర్తను నేను భోక్తను అను ఇత్యాది అనుభవము కలుగుచుండుటచేతను బుద్ధియే ఆత్మయని బౌద్ధులు చెప్పుచున్నారు.

మీమాంసకుల వాదములు

ప్రభాకరతార్కికౌతు "అన్యోఽన్తర ఆత్మానందమయః" (తై. 2-5-1) ఇత్యాదిశ్రుతేర్బుద్ధ్యాదీనా మజ్ఞానే లయదర్శనాదహమజ్ఞోఽహమజ్ఞానీత్యాద్యనుభవాచ్చాజ్ఞాన మాత్మేతి వదతః ॥ 129

తా॥ మనోబుద్ధులకంటె భిన్నమై తదంతర్గతమైన ఆనందమే ఆత్మ యని శ్రుతివచనము. సుషుప్తియందు బుద్ధ్యాదులు అజ్ఞానమందు లయము పొందుటచేతను, నేను అజ్ఞుడను నేను అజ్ఞానిని అను అనుభవము గలుగుచుండుటచేతను అజ్ఞానమే ఆత్మ యని ప్రాభాకరులు తార్కికులు చెప్పుచున్నారు.

భాట్టస్తు 'ప్రజ్ఞాన ఘన ఏవానందమయః'
(మాండూక్య-5) ఇత్యాదిశ్రుతేః సుషుప్తౌ ప్రకాశా
ప్రకాశసద్భావాన్మామహం న జానామీత్యాద్యను
భవాచ్చ అజ్ఞానోపహితం చైతన్యమాత్మేతి వదతి ॥

తా॥ ఆనందమయమైన ప్రజ్ఞానఘనమే ఆత్మయని శ్రుతివచనము. సుషుప్తియందు జ్ఞానాజ్ఞానములు భాసించుటచేతను, నిద్రలో నన్ను నేను తెలిసికొనలేకున్నాను అను అజ్ఞానముయొక్క అనుభవముచేతను ఇట్టి అజ్ఞానోపహితమైన చైతన్యమే ఆత్మ యని భాట్టమతస్థులు పల్కుచున్నారు.

## శూన్యవాదులు

అపరో బౌద్ధః "అసదేవమగ్ర ఆసీత్"
(ఛాందోగ్య 6-2-1) ఇత్యాదిశ్రుతేః సుషుప్తౌ
సర్వాభావాదహం సుషుప్తౌ నాసమిత్యుత్థితస్య
స్వాభావపరామర్శ విషయానుభవాచ్చ
శూన్యమాత్మేతి వదతి ॥ 131

తా॥ ఈ అసత్ (శూన్యమే) ఆదియందున్నది. అనునది శ్రుతి వచనము. సుషుప్తియందు సర్వము శూన్యముగా నుండుటచేతను, నిద్రనుండి మేల్కాంచిన వెనుక "నేను నిద్రలో లేను" అను స్మరణ అనుభవముకలుగుట చేతను శూన్యమే ఆత్మయని శూన్యవాదులగు బౌద్ధులు చెప్పుచున్నారు.

## ఆత్మయొక్క నైజతత్త్వ స్థాపనము

ఏతేషాం పుత్రాదీనామనాత్మ త్వముచ్యతే ॥ 132

తా॥ చార్వాకాదులు నిర్ణయించిన యీ పుత్రాది శూన్యపర్యంతము ఏదియు ఆత్మకాదని యిపుడు నిరూపింపబడుచున్నది.

ఏతైరతిప్రాకృతాదివాదిభిరుక్తేషు శ్రుతియుక్త్యను భవాభాసేషు పూర్వపూర్వోక్త శ్రుతియుక్త్యనుభవా భాసానాం ఉత్తరోత్తర శ్రుతియుక్త్యనుభవాభాసైః ఆత్మత్వబాధదర్శనాత్ పుత్రాదీనామనాత్మత్వం స్పష్టమేవ॥ 133

తా॥ అతిప్రాకృతాదులు చెప్పిన శ్రుతియుక్త్యనుభవములన్నియు కేవలము అభాసమాత్రములే అందుపూర్వమతస్థుల మతము ప్రకారము నిర్వచింపబడిన పుత్రాది ఆత్మలు ఉత్తరోత్తర మతముల శ్రుతియుక్త్యను భవములచేత బాధింపబడినవగుటచేతనే పుత్రాదులకు అనాత్మత్వము స్పష్టముగా సిద్ధించుచున్నది.

కించ ప్రత్యగస్థూలోఽచక్షురప్రాణోఽమనా అకర్తా చైతన్యం చిన్మాత్రం సదిత్యాది ప్రబలశ్రుతివిరోధాదస్య పుత్రాది శూన్య పర్యంతస్య జడస్య చైతన్యా భాస్యత్వేన ఘటాదివదనిత్యత్వాదహం బ్రహ్మేతి విద్వదనుభవ ప్రాబల్యాచ్చ తత్తత్ శ్రుతియుక్త్యను

భవాభాసానాం బాధితత్వాదపి పుత్రాది
శూన్యపర్యంతమఖిలమనాత్మైవ ॥ 134

తా॥ అస్థూలము, అచక్షువు, అప్రాణము, అమనము అకర్తా యగు చిన్మాత్రమైన చైతన్యమే ఆత్మయని ప్రబలశ్రుతి ప్రమాణము ఉండుటచేత అట్టి శ్రుతి వాక్యమునకీ పుత్రాది ఆత్మత్వము విరోధి యగుచున్నది. అట్టి శ్రుతికి విరుద్ధమై జడరూపమైన యీ పుత్రాది శూన్యపర్యంతమైనవన్నియు ఆ చైతన్యముచే ప్రకాశితములగుటచేత ఘటమువలె అనిత్యమగుచున్నవి. మరియు "అహంబ్రహ్మ" అని విద్వాంసుల ప్రబల అనుభవము ఉన్నది కావున ఆయా శ్రుతియుక్త్యనుభవములు బాధితమై పుత్రాదిశూన్యపర్యంతము ఆత్మకాదు అని స్పష్టమగుచున్నది.

అతస్తత్తద్భాసకం నిత్యశుద్ధబుద్ధముక్తసత్యస్వభావం
ప్రత్యక్ చైతన్యమేవాత్మవస్త్వితి వేదాంతవిద్వదను
భవః ॥ 135

తా॥ కావున ఆయాపుత్రాదులను కూడ భాసింపజేయునదై నిత్యశుద్ధ బుద్ధముక్త సత్యస్వభావముగల యీ ప్రత్యక్ చైతన్యమే ఆత్మవస్తువు. ఇదియే వేదాంత విద్వాంసులయొక్క అనుభవము.

ఏవం అధ్యారోపః ॥ 136

తా॥ ఇంతవరకు చెప్పినదంతయు అధ్యారోపముయొక్క వివరణమై యున్నది.

# అధ్యాయము ౪

## అపవాదము

అపవాదో నామ రజ్జు వివర్తస్య సర్పస్య
రజ్జుమాత్రత్వవద్వస్తు వివర్త స్యావస్తునోఽజ్ఞానాదేః
ప్రపంచస్య వస్తుమాత్రత్వం ॥ 137

తా॥ భ్రాంతివలన త్రాడు సర్పముగా తోచినప్పటికిని అది త్రాడు మాత్రమే ఎలాగవుచున్నదో అదేవిధముగా అజ్ఞానముచే వాస్తవమైన ఆ బ్రహ్మయందు యీ ప్రపంచము తోచినప్పటికిని, వాస్తవములోనున్నది ఆ బ్రహ్మ మాత్రమే. ఈ విధముగా అధ్యారోపమందలి భ్రాంతిని తొలగించుట అపవాదమనబడుచున్నది.

తదుక్తం—

సతత్త్వతోఽన్యథా ప్రథా వికార ఇత్యుదీరితః ।
అతత్త్వతోఽన్యథాప్రథా వివర్త ఇత్యుదీరితః
ఇతి ॥ 138

తా॥ వస్తువును మరియొకవిధముగా మార్చివేయుట వికారము లేదా పరిణామము - పాలు పెరుగుగా మారుట, వివర్తమనగా అట్టి పరిణామము గాక వాస్తవస్థితి మార్పుచెందకుండ కేవలము అన్యథా భాసించుటమాత్రమే అగుచున్నది. (రజ్జువునందు) త్రాటియందు సర్పభావము లేదా శుక్తియందు రజతభ్రాంతి ॥

ఇచట ఆ బ్రహ్మ పాలు పెరుగువలె పూర్తిగా ప్రపంచరూపములో పరిణామము చెందలేదు కాని యీ వాస్తవబ్రహ్మయందే అవాస్తవజడరూప ప్రపంచము కేవలము భాసింపుచున్నది. బ్రహ్మ నిత్యము అవికారి అని శ్రుతులు చెప్పుటచేత యీ ప్రపంచము బ్రహ్మయొక్క పరిణామముమాత్రము కాదు. అది వివర్తమే యగును.

తథాహి ఏతద్భోగాయతనం చతుర్విధసకలస్థూల
శరీరజాతం భోగ్యరూపాన్నపానాదికమేతదాయతనభూత
భూరాది చతుర్దశ భువనాన్యేతదాయతనభూతం
బ్రహ్మాండం చైతత్సర్వ మేతేషాం కారణరూపం
పంచీకృతభూత మాత్రం భవతి ॥ 139

తా॥ కార్యమంతయు కారణస్వరూపమే యగుచున్నది. కావున అజ్ఞానకార్యమైన యీ జగత్తంతయు తుదకు అజ్ఞాన రూపమగుచున్నది. ప్రప్రథమముగా భోగములకు సాధనమైన యీ చతుర్విధస్థూలశరీరములున్ను, భోగ్యవిషయములైన అన్నపానాదులను, ఈ రెండింటికిని స్థానమైన భూర్భువాది చతుర్దశలోకములున్ను దీనికి ఆశ్రయమైన బ్రహ్మాండమున్ను - ఇవి యన్నియు వీనికి కారణమైన పంచీకృతమైన స్థూలపంచభూతముల యొక్క రూపములే కాని వేరుకాదు.

ఏతాని శబ్దాదివిషయసహితాని పంచీకృతాని
భూతాని సూక్ష్మశరీరజాతం చైతత్సర్వమేతేషాం
కారణరూపాపంచీకృతభూతమాత్రం భవతి ॥ 140

తా॥ శబ్దాది విషయములతో కూడిన యీ స్థూల పంచభూతములు, సూక్ష్మభూతసమూహమున్ను తత్కారణభూతమైన అపంచీకృత భూతములు మాత్రమే కాని వేరుకాదు.

ఏతాని సత్త్వాదిగుణసహితాన్యపంచీకృతాన్యుత్ప
త్తి వ్యుత్క్రమేణ ఏతత్కారణభూతాజ్ఞానోపహిత
చైతన్యమాత్రం భవతి॥ 141

తా॥ సత్త్వాది గుణసహితమైన యీ అపంచీకృత భూతసంఘము తమ ఉత్పత్తియొక్క అపక్రమముచేత వీనికి చరమకారణమైన అజ్ఞానముచే ఆవృతమైన చైతన్యము మాత్రమే యగుచున్నది.

ఏతదజ్ఞానం అజ్ఞానోపహితంచైతన్యం చేశ్వరాదిక
మేతదాధారభూతానుపహిత చైతన్యరూపం తురీయం
బ్రహ్మమాత్రం భవతి॥ 142

తా॥ ఇట్టి అజ్ఞానము, అజ్ఞానావృత చైతన్యము ఈశ్వరాదులు - ఇవన్నియును వీనికి ఆధారభూతమైన అజ్ఞానావృతముగాని శుద్ధచైతన్యరూపమైన తురీయ బ్రహ్మము మాత్రమే యగుచున్నది.

ఆభ్యామధ్యారోపాపవాదాభ్యాం తత్త్వం పదార్థ
శోధనమపి సిద్ధం భవతి॥ 143

తా॥ ఈ అధ్యారోప అపవాదములద్వారా తత్త్వమసి వాక్యములోని తత్ - త్వం. పదములయొక్క అర్థమును పరిశీలించుటకూడ జరుగుచున్నది.

తథాహి - అజ్ఞానాది సమష్టిరేతదుపహితం సర్వ
జ్ఞాత్వాది విశిష్టం చైతన్యం ఏతదనుపహితం
చైతత్త్రియం తప్తాయఃపిండవదేకత్వేనావభాసమానం
తత్పద వాచ్యార్థో భవతి ॥ 144

తా॥ ఎల్లునగా అజ్ఞానాది సమష్టి, దానితో సంబంధించిన సర్వజ్ఞత్వాది విశిష్ట చైతన్యము, శుద్ధచైతన్యము అను నీ మూడింటిని తప్త అయః పిండమువలె కలిసిచెప్పినపుడు తత్ పదమునకు వాచ్యార్థమగుచున్నది అనగా ఎఱ్ఱగా కాలిన ఇనుపగుండులోని అగ్నిని ఇనుమును ఒకటిగా గ్రహించినట్లు పై మూడింటిని ఒకటిగా గ్రహించిన తత్ పదమునకు వాచ్యార్థమగుచున్నది.

ఏతదుపాధ్యుపహితాధారభూతం అనుపహితం
చైతన్యం తత్పద లక్ష్యార్థో భవతి ॥ 145

తా॥ ఈ ఈశ్వరాది చైతన్యములకు ఆధారభూతమైనట్టియు, అజ్ఞానముచే అనుపహితమైనట్టియు (తురీయ) చైతన్యము తత్పదమునకు లక్ష్యార్థమగుచున్నది.

అజ్ఞానాది వ్యష్టిరేతదుపహిత అల్పజ్ఞత్వాది విశిష్ట
చైతన్యం. ఏతదనుపహిత చైతత్త్రియం తప్తాయః
పిండవత్ ఏకత్వేనావభాసమానం త్వం పదవాచ్యార్థో
భవతి ॥ 146

తా॥ అజ్ఞానాది వ్యష్టియు, దానితో సంబంధించిన అల్పజ్ఞత్వాది విశిష్ట చైతన్యము, తదనుపహితమైన శుద్ధ చైతన్యము అను నీ మూడును తప్తాయః పిండమువలె మొత్తమువీద ఒకటిగా చూచిన త్వం పదమునకు వాచ్యార్థమగుచున్నది.

తత్తదుపాధ్యుపహితాధార భూతమనుపహితం
ప్రత్యగానందం తురీయం చైతన్యం త్వంపదలక్ష్యార్థో
భవతి ॥ 147

తా॥ ఈ ఉపాధులకు సంబంధించిన ప్రాజ్ఞాది చైతన్యములకు ఆధారమైనట్టియు, అజ్ఞానముచే అనుపహితమైనట్టియు ప్రత్యగానందమైన తురీయం చైతన్యము త్వం పదమునకు లక్ష్యార్థమగుచున్నది.

## తత్త్వమసి వాక్యార్థ వివరణము

అథ మహావాక్యార్థో వర్ణ్యతే । ఇదం తత్త్వమసి
వాక్యం సంబంధత్రయేణ అఖండార్థబోధకం భవతి॥ 148

తా॥ ఇప్పుడు మహావాక్యముయొక్క అర్థము వివరింపబడుచున్నది ఈ తత్త్వమసి అను వాక్యము సంబంధత్రయముచేత అఖండార్థ బోధకమగుచున్నది.

సంబంధత్రయం నామ పదయోః సామానాధికరణ్యం
పదార్థయోర్విశేషణవిశేష్యభావః ప్రత్యగాత్మ
లక్షణయో ర్లక్ష్యలక్షణ భావశ్చేతి ॥ 149

తా॥ సంబంధత్రయమనగా - పదములయొక్క సామానాధికరణ్యము, పదార్థములకు విశేషణ విశేష్యభావము, ప్రత్యగాత్మ లక్షణములకు లక్ష్య లక్షణభావము అనునవి మూడు సంబంధములు.

తదుక్తం—

సామానాధి కరణ్యంచ విశేషణ విశేష్యతా ।
లక్ష్యలక్షణసంబంధః పదార్థప్రత్యగాత్మనాం ఇతి ॥ 150

తా॥ రెండుపదములకు సామానాధికరణ్య సంబంధము, పదార్థములకు విశేషణ విశేష్య భావసంబంధము, పదార్థ ప్రత్యగాత్మలకు లక్ష్యలక్షణభావ సంబంధము అని నైష్కర్మ్య సిద్ధియందు మూడు సంబంధములు వివరింపబడి యున్నది.

సామానాధకరణ్యసంబంధస్తావద్యథా సోఽయం దేవదత్త ఇత్యస్మిన్ వాక్యే తత్కాలవిశిష్టదేవదత్త వాచక స శబ్దస్యైతత్కాల విశిష్ట దేవదత్తవాచక అయం శబ్దస్య చైకస్మిన్ పిండే తాత్పర్య సంబంధః । తథా చ తత్త్వమసీతి వాక్యేఽపి పరోక్షత్వాది విశిష్ట చైతన్యవాచక తత్పదస్యాపరోక్షత్వాది విశిష్ట చైతన్య వాచకత్వంపదస్య చైకస్మిన్ చైతన్యే తాత్పర్య సంబంధః ॥ 151

తా॥ సామానాధికరణ్య సంబంధమనగా "సః అయం దేవదత్తః - ఇతడు అ దేవదత్తుడు" అను వాక్యమందు పూర్వకాలముతో సంబంధముగల

ఆ దేవదత్తుని తెలుపు సః (ఆ) శబ్దమునకును, వర్తమానకాలముతో సంబంధము గల ఈ దేవదత్తుని తెలుపు అయం (ఈ) శబ్దమునుకున్న ఒకేవ్యక్తియందు తాత్పర్యము కలిగియుండుటయే సంబంధము. అదేవిధముగా "తత్త్వమసి" అనువాక్యమునందును పరోక్షత్వాది లక్షణములుగల చైతన్యమును చెప్పుతత్ శబ్దమునకును, అపరోక్షత్వాది లక్షణములుగల చైతన్యమును తెలుపు త్వం పదమునకును ఒకే చైతన్యమందు తాత్పర్యసంబంధమున్నది కావున రెండు పదములును సామానాధికరణ్య సంబంధముకలవి అగుచున్నవి.

విశేషణవిశేష్యభావ సంబంధస్తు యథా తత్రైవవాక్యే సశబ్దార్థతత్కాలవిశిష్టదేవదత్తస్య అయంశబ్దార్థ ఏతత్కాలవిశిష్ట దేవదత్తస్య చాన్యోన్యభేదవ్యావర్తక తయా విశేషణవిశేష్యభావః। తథాత్రాపివాక్యే తత్పదార్థపరోక్షత్వాదివిశిష్టచైతన్యస్య త్వంపదార్థా పరోక్షత్వాది విశిష్టచైతన్యస్య చాన్యోన్యభేదవ్యా వర్తకతయా విశేషణ విశేష్యభావః॥ 152

తా॥ విశేషణ విశేష్య భావసంబంధము - "సః అయం దేవదత్తః" అను ఆ వాక్యమందే స శబ్దమునకు అర్థమైన ఆకాలమందలి దేవదత్తునకును, అయం - శబ్దమునకు అర్థమైన వర్తమానమందలి యీ దేవదత్తునకును పరస్పరము భేదము లేకపోవుటచేత విశేషణ విశేష్యభావ సంబంధము. అదే విధముగా తత్త్వమసి వాక్యమందును తత్ పదమునకు అర్థమైన పరోక్ష త్వాది విశిష్ట చైతన్యమునకును త్వం పదమునకును అర్థమైన అపరోక్షత్వాది విశిష్ట చైతన్యమునకును పరస్పరము భేదము నివారింపబడుటచేత విశేషణ విశేష్య భావ సంబంధము.

లక్ష్యలక్షణభావసంబంధస్తు యథా తత్త్వైవ సశ్బ్ద
అయంశబ్దయోః తదర్థయోర్వా విరుద్ధ తత్కాలై
తత్కాల విశిష్టత్వపరిత్యాగేనావిరుద్ధ దేవదత్తేన
సహ లక్ష్యలక్షణభావః। తథాత్రాపి వాక్యే తత్త్వంపద
యోస్తదర్థయో ర్వా విరుద్ధ పరోక్షత్వాపరోక్షత్వాది
విశిష్టత్వ పరిత్యాగేనావిరుద్ధ చైతన్యేన సహ
లక్ష్యలక్షణభావః॥ 153

తా॥ లక్ష్య లక్షణభావ సంబంధము - "సః అయం దేవదత్తః" అను ఆ వాక్యమందే సశబ్ద అయం శబ్దములకును వాని అర్థములందును గల భూతకాలవర్తమాన కాలరూప విరోధమును తీసివేసిన మిగిలియుండు విరోధములేని ఒకే దేవదత్తునితో లక్ష్యలక్షణభావ సంబంధము. అదేవిధముగా తత్ త్వం పదములకును వాని యర్థములందును విరోధమును సూచించు పరోక్షత్వా పరోక్షత్వాది విశిష్టతను తీసివేసిన మిగిలిన అవిరుద్ధమైన ఏక చైతన్యముతో లక్ష్య లక్షణభావసంబంధము.

ఇయమేవ భాగలక్షణేత్యుచ్యతే॥ 154

తా॥ దీనినే భాగలక్షణ యనుచున్నారు.

అస్మిన్ వాక్యే నీలముత్పలమితి వాక్యవద్వాక్యార్థో న
సంగచ్ఛతే॥ 155

తా॥ "నీలం ఉత్పలం" అను వాక్యమందు వాక్యార్థము సరిపడు నట్టు ఈ తత్త్వమసి వాక్యమందు వాక్యార్థము సరిపడదు.

తత్ర తు నీలపదార్థనీలగుణస్యోత్పలపదార్థోత్పల
ద్రవ్యస్య చ శౌక్ల్యపటాదిభేదవ్యావర్తకతయాన్యోన్య
విశేషణ విశేష్యభావరూప సంసర్గస్యాన్యతర
విశిష్టస్యాన్యతరస్య తదైక్యస్య వా వాక్యార్థ
త్వాంగీకారే ప్రమాణాంతర విరోధాభావాత్తద్వాక్యార్థః
సంగచ్ఛతే ॥ 156

తా॥ నీలం ఉత్పలం అను వాక్యమందు నీల పదమునకు అర్థమైన నీల గుణమునకును, ఉత్పలపదమునకును అర్థమైన ఉత్పల ద్రవ్యమునకును శౌక్ల్య పటాదులనుండి భేదమును సాధించుచున్నది కావున యీ నీల ఉత్పలముల రెండింటికిని విశేషణ విశేష్యభావరూప సంబంధమును వాక్యార్థముగా అంగీకరించినపుడుగాని, లేక నీలవిశిష్ట ఉత్పలమునుగాని ఉత్పలవిశిష్ట నీలమునుగాని వాక్యార్థముగా గ్రహించినపుడుగాని, లేదా రెండింటి యొక్క ఐక్యమును వాక్యార్థముగా గ్రహించినపుడుగాని ఇతరమైన ప్రత్యక్షాది ప్రమాణములతో విరోధములేదు కాబట్టి ఆ వాక్యార్థము కుదురు చున్నది.

అత్ర తు తత్పదార్థపరోక్షత్వాదివిశిష్ట చైతన్యస్య త్వం
పదార్థాపరోక్షత్వాదివిశిష్ట చైతన్యస్య చాన్యోన్యభేద
వ్యావర్తకతయా విశేషణ విశేష్యభావ సంసర్గస్యాన్యతర
విశిష్టస్యాన్య తరస్య తదైక్యస్య వా వాక్యార్థత్వాంగీకారే
ప్రత్యక్షాది ప్రమాణవిరోధాత్ వాక్యార్థో న
సంగచ్ఛతే ॥ 157

తా॥ ఈ తత్త్వమసి వాక్యమందు తత్పదమునకు అర్థమైన పరోక్షత్వాది విశిష్ట చైతన్యమునకును, త్వం పదమునకు అర్థమైన అపరోక్షత్వాది విశిష్ట చైతన్యమునకును పరస్పర భేద వ్యావర్తకముగా విశేషణ విశేష్యభావ సంబంధమునుగాని, పరోక్షత్వాది విశిష్ట చైతన్యముతో కూడిన అపరోక్షత్వాది విశిష్ట చైతన్యమునుగాని లేదా ఆ రెండు చైతన్యములయొక్క ఐక్యమునుగాని వాక్యార్థముగా అంగీకరించినయెడల ప్రత్యక్షాది ప్రమాణములతో విరోధము కలుగును కావున యిచట వాక్యార్థము కుదరదు.

తదుక్తం—

> సంసర్గో వా విశిష్టో వా వాక్యార్థో నాత్ర సమ్మతః।
> అఖండైకరసత్వేన వాక్యార్థో విదుషాం మతః॥ ఇతి
> (పంచదశీ. 7-75) 158

తా॥ తత్త్వమసి వాక్యమందు సంసర్గము కాని విశిష్టము కాని వాక్యార్థముగా కుదరదు. ఈ రెండు పదముల అర్థమునకును అఖండైకరసత్వమే వాక్యార్థమని విద్వాంసుల మతము.

> అత్ర గంగాయాం ఘోషః ప్రతివసతీతి వాక్యవజ్జహ
> ల్లక్షణాపి న సంగచ్ఛతే॥ 159

తా॥ "గంగాయాం ఘోషః ప్రతివసతి" - గంగయందు గొల్లపల్లె ఉన్నదియను వాక్యమందువలె నీ వాక్యమందు జహల్లక్షణ కూడ కుదరదు.

> తత్ర తు గంగాఘోషయోరాధారాధేయభావలక్షణస్య
> వాక్యార్థస్యాశేషతో విరుద్ధత్వాద్వాక్యార్థమశేషతః

పరిత్యజ్య తత్సంబంధితీరలక్షణాయా యుక్తత్వాత్
జహల్లక్షణా సంగచ్ఛతే॥ 160

తా॥ "గంగయందు గొల్లపల్లె యున్నది" యనునపుడు గంగా గొల్లపల్లెలకు ఆధారాధేయభావరూపమైన వాక్యార్థము పూర్తిగా విరుద్ధమగుటవలన దానిని పూర్తిగా విడిచిపెట్టి ఆ గంగకు సంబంధించిన తీరమునందు లక్షణ చెప్పికొనుట తగియున్నది కావున గంగాయాం ఘోషః అనుచోట జహల్లక్షణ సరిపోవుచున్నది.

అత్రతు పరోక్షాపరోక్ష చైతన్యైకత్వలక్షణస్య
వాక్యార్థస్య భాగమాత్రే విరోధాత్ భాగాంతరమపి
పరిత్యజ్య అన్యలక్షణాయా అయుక్తత్వాత్ జహల్లక్షణా
న సంగచ్ఛతే॥ 161

తా॥ కాని తత్త్వమసి వాక్యములో పరోక్ష అపరోక్ష చైతన్యముల యొక్క ఐక్యమును వాక్యార్థముగా చెప్పవలసి వచ్చినపుడు అచట వాక్యార్థముయొక్క ఒక భాగమునకు మాత్రమే విరోధము కలుగును. అనగా పరోక్షత్వ అపరోక్షత్వములు పరస్పర విరుద్ధములు కావున ఆ భాగమునందు విరోధము కలుగుచున్నది. అందువలన రెండవభాగమగు చైతన్యరూప అర్థమును విడిచిపెట్టి తత్సంబంధి యగు మరియొక దానియందు లక్షణచెప్పుదమనిన అది సరిపడదు. ఎలననగా చైతన్యములయొక్క ఐక్యమే యిచట కావలసిన వాక్యార్థము. దానిని విడిచిపెట్టిన అసలువాక్యార్థమే లేకపోవును కావున నిచట జహల్లక్షణ కుదరదు.

న చ గంగాపదం స్వార్థపరిత్యాగేన తీరపదార్థం
యథా లక్షయతి తథా తత్పదం త్వం పదం వా స్వార్థ

పరిత్యాగేన త్వం పదార్థం తత్పదార్థం వా లక్షయత్వతః
కుతో జహల్లక్షణా న సంగచ్ఛత ఇతివాచ్యం ॥ 162

తా॥ మరియు గంగాపదము తన స్వంత అర్థమును విడిచిపెట్టి తీరపదముయొక్క అర్థమును ఎట్లు లక్షణయా చెప్పుచున్నదో అట్లే తత్ పదముగాని త్వం పదముగాని తమ వాచ్యార్థమును విడిచిపెట్టి త్వం పదార్థముగాని తత్ పదార్థమునుగాని లక్షణయా చెప్పవచ్చునుకదా. ఆ పక్షమందు జహల్లక్షణ ఎందుకు కుదరదు?" అని అనకూడదు.

తత్ర తీరపదాశ్రవణేన తదర్థాప్రతీతౌ లక్షణయా
తత్ప్రతీత్యపేక్షాయామపి తత్త్వంపదయోః శ్రూయమా
ణత్వేన తదర్థప్రతీతౌ లక్షణయా పునరన్యతర
పదేనాన్యతరపదార్థప్రతీత్యపేక్షాభావాత్ ॥ 163

తా॥ అచట తీరపదము లేకపోవుటవలన ఆ తీర ప్రతీతికొరకు గంగాపదమునకు తీరమందు జహల్లక్షణ కుదురుచున్నది. కాని యిచట తత్ త్వం పదములు రెండును ప్రత్యక్షముగా వినబడుచున్నవి. కావున ఒక పదముచే మరియొక పదముయొక్క అర్థమును లక్షణచేత చెప్పుకొనవలసిన ఆవశ్యకత లేదు. అందుచే న తత్త్వమసి వాక్యమందు జహల్లక్షణ కుదరదు.

అత్ర శోణో ధావతీతి వాక్యవదజహల్లక్షణాపి
న సంభవతి ॥ 164

తా॥ ఈ తత్త్వమసి వాక్యమందు "శోణో ధావతి - ఎరుపు పరుగెత్తుచున్నది" అను వాక్యమందువలె అజహల్లక్షణ కూడ కుదరదు.

తత్ర శోణగుణగమనలక్షణస్య వాక్యార్థస్య
విరుద్ధత్వాత్తదపరిత్యాగేన తదాశ్రయాశ్వాదిలక్షణయా
తద్విరోధ పరిహారసంభవాదజహల్లక్షణా సంభవతి ॥ 165

తా॥ ఎరుపురంగు పరుగెత్తుట అసంభవము కనుక అచట సరియైన అర్థము స్ఫురించకపోవుటచేత ఎరుపురంగుగల అశ్వమునందు లక్షణ చెప్ప వలసియున్నది. ఇచట శోణపదము తన వాచ్యార్థమును పూర్తిగా విడువ కుండనే మరియొక అర్థమును లక్షణయా చెప్పుచున్నది. కావున ఇచట అజహల్లక్షణ కుదురుచున్నది.

అత్ర తు పరోక్షత్వాపరోక్షత్వాది విశిష్ట చైతన్యైక
త్వస్య వాక్యార్థస్య విరుద్ధత్వాత్తదపరిత్యాగేన తత్సంబంధి
నో యస్యకస్యచిదర్థస్య లక్షితత్వేఽపి తద్విరోధ పరిహారా
సంభవాదజహల్లక్షణా న సంభవత్యేవ ॥ 166

తా॥ ఇచట పరోక్షత్వ అపరోక్షత్వములతో కూడిన చైతన్యముల యొక్క ఐక్యము వాక్యార్థముగా కుదరదు. కావున ఆ పరోక్షత్వ అపరో క్షత్వములను వదలిపెట్టకుండ చైతన్యసంబంధియగు ఏదో మరియొక వస్తువు నందు లక్షణను చెప్పినప్పటికిని పరోక్షత్వ అపరోక్షత్వముల విరోధము పరిహ రింపబడదు. కావున నీ తత్త్వమసి వాక్యమందు అజహల్లక్షణకూడకుదరదు.

న చ తత్పదం త్వం పదం వా స్వార్థవిరుద్ధాంశ పరిత్యా
గేనాంశాంతరసహితం త్వం పదార్థం తత్పదార్థం వా
లక్షయత్వతః కథం ప్రకారాంతరేణ భాగలక్షణాంగీకరణ
మితివాచ్యం ॥ 167

తా॥ ఇచట తత్పదము పరోక్షత్వాది గుణములను విడిచిపెట్టి శుద్ధ చైతన్యమును, త్వం పదార్థమగు అపరోక్షత్వాది విశిష్ట చైతన్యమును కలిపిభాగలక్షణచే చెప్పవచ్చును. లేదా త్వం పదము అపరోక్షత్వాది గుణములనువిడిచిపెట్టి శుద్ధ చైతన్యమును తత్పదార్థమగు పరోక్షత్వాది విశిష్ట చైతన్యమును రెండింటిని కలిపి భాగలక్షణచే చెప్పవచ్చునుకదా అని ఆశంకించరాదు.

ఏకేన పదేన స్వార్థాంశపదార్థాంతరోభయలక్షణాయాం
అసంబంధాత్ పదాంతరేణ తదర్థప్రతీతౌ లక్షణ యాం
పున స్తత్ప్రతీత్యపేక్షాభావాచ్చ ॥ 168

తా॥ 163 వ సూత్రమునందువలె త్వం తత్ పదములు ప్రత్యక్షముగా వినబడుచుండుటవలన ఒక పదముచేత మరియొక పదముయొక్క అర్థమును లక్షణయా చెప్పుట అనావశ్యకము కదా. కావున యిచట భాగలక్షణ కుదరదు.

తస్మాద్యథా సోఽయం దేవదత్త ఇతివాక్యం తదర్థో
వా తత్కాల ఏతత్కాల విశిష్ట దేవదత్త లక్షణస్య
వాక్యార్థస్యాంశే విరోధాత్ విరుద్ధ తత్కాల ఏతత్కాల
విశిష్టాంశం పరిత్యజ్య అవిరుద్ధం దేవదత్తాంశమాత్రం
లక్షయతి తథా తత్త్వమసీతి వాక్యం తదర్థో వా
పరోక్షత్వాపరోక్షత్వాది విశిష్ట చైతన్య ఏకత్వలక్షణస్య
వాక్యార్థస్యాంశే విరోధాత్ విరుద్ధ పరోక్షత్వాపరోక్ష
త్వాది విశిష్టాంశం పరిత్యజ్య అవిరుద్ధం
అఖండచైతన్యమాత్రం లక్షయతీతి ॥ 169

తా॥ కావున - సః అయం దేవదత్తః - అను వాక్యముగాని దాని యర్థముగాని తత్కాల ఏతత్కాల విశిష్టదేవదత్త రూపవాక్యార్థమందు ఒక అంశమున విరోధము వచ్చుచున్నది కావున విరుద్ధమైన తత్కాల ఏతత్కాల విశిష్ట అంశములను విడిచిపెట్టి అవిరుద్ధమైన దేవదత్తుని మాత్రము లక్షణయా ఎట్లు చెప్పుచున్నదో అట్లే తత్త్వమసి అను వాక్యముగాని దాని యర్థము గాని పరోక్షత్వ అపరోక్షత్వ విశిష్ట చైతన్య ఏకత్వరూప వాక్యార్థమందు పరోక్షత్వ అపరోక్షత్వరూప అంశములకు విరోధము వచ్చుచున్నది కావున అ పరోక్షత్వ అపరోక్షత్వ విశిష్ట అంశమును విడిచిపెట్టి అవిరుద్ధమైన అఖండ చైతన్యమును మాత్రమే లక్షణయా చెప్పుచున్నది.

## "అహంబ్రహ్మాస్మి" వాక్యార్థము

అథాధునాహం బ్రహ్మాస్మి (బృహ. 1-4-10) ఇత్యను భవ వాక్యార్థో వర్ణ్యతే ॥ 170

తా॥ ఇప్పుడు "అహం బ్రహ్మాస్మి" అను అనుభవవాక్యముయొక్క అర్థము వివరింపబడుచున్నది.

ఏవమాచార్యేణాధ్యారోపాపవాదపురస్సరం తత్త్వం పదార్థౌ శోధయిత్వా వాక్యేనాఖండార్థేఽవబోధితేఽధి కారిణోఽహం నిత్యశుద్ధబుద్ధముక్తసత్య స్వభావపరమా నందానంతాద్వయం బ్రహ్మాస్మీత్యఖండాకారాకారితా చిత్తవృత్తిరుదేతి ॥ 171

తా॥ ఈ విధముగా అధ్యారోప అపవాదముల ద్వారా తత్ త్వం పదార్థములను పరిశీలించి ఈ మహావాక్యముద్వారా ఆచార్యుడు అఖండార్థ

మును బోధించగా అధికారియగు శిష్యునకు "నేను నిత్యశుద్ధబుద్ధ ముక్తసత్య స్వభావ పరమానంద అనంత అద్వయ బ్రహ్మను అయితిని" అను అఖండాకారాకారితమైన చిత్తవృత్తి కలుగుచున్నది.

సా తు చిత్ప్రతిబింబసహితా సతీ ప్రత్యగభిన్న
మజ్ఞాతం పరంబ్రహ్మ విషయీకృత్య తద్గతాజ్ఞానమేవ
బాధతే తదా పటకారణ తంతుదాహే పటదాహవదఖిల
కారణేఽజ్ఞానే బాధితే సతి తత్కార్యస్యాఖిలస్య
బాధితత్వా త్తదంతర్భూతాఖండాకారాకారితా
చిత్తవృత్తిరపి బాధితా భవతి ॥ 172

తా॥ ఆ చిత్తవృత్తి శుద్ధచైతన్యముయొక్క ప్రతిబింబముతో కూడి, అంతవరకు తెలిసికొనబడక తన ప్రత్యగాత్మకంటె భిన్నముకాని పరబ్రహ్మనైపు మరలి ఆ బ్రహ్మయందున్నట్లు భాసించు జీవగత అజ్ఞానమును తొలగించుచున్నది. అప్పుడు వస్త్రమునకు కారణమైన దారములను కాల్చివేయగా ఆ వస్త్రమెట్లు నశించుచున్నదో ఆదేవిధముగా అఖిలమునకు కారణమైన అజ్ఞానము నశించగనే అజ్ఞానకార్యమగు సమస్తమున్ను నశించుచున్నది కావున ఆ అఖిలములో నంతర్భూతమైన అఖండాకారాకారితమైన చిత్తవృత్తికూడ నశించుచున్నది.

తత్ర ప్రతిబింబితం చైతన్యమపి యథా
దీపప్రభాఽదిత్యప్రభావభాసనాసమర్థా సతీ తయాఽ
భిభూతా భవతి తథా స్వయంప్రకాశమానప్రత్యగభిన్న
పరబ్రహ్మావభాస నా నర్హతయా తేనాభిభూతం సత్
స్వోపాధిభూతాఖండ వృత్తే ర్బాధిత త్వాద్దర్పణాభావే

ముఖప్రతిబింబస్య ముఖమాత్రత్వవత్ ప్రత్యగభిన్న
పరబ్రహ్మమాత్రం భవతి ॥ 173

తా॥ దీపప్రభ సూర్యకాంతిని ప్రకాశింపచేయలేక దానిచేత అభిభూతమైనట్లు చిత్తవృత్తియందు ప్రతిబింబించిన జీవరూపచైతన్యము తన ప్రకాశముచే అనంతమైన పరబ్రహ్మను ప్రకాశింపచేయలేక అభిభూతమై, తనకు ఉపాధియైన చిత్తవృత్తికూడ నశించుటచేత ఆ బ్రహ్మయందే లీనమగుచున్నది. ప్రతిబింబమునకు ఆధారమైన అద్దము లేకపోవుటచేత ఆ ప్రతిబింబము నశించి బింబమైన ముఖముమాత్రముగా అగుచున్నది. అదేవిధముగా తన ప్రతిబింబమున కాధారమైన అఖండాకారచిత్తవృత్తి నశించిపోగానే అది బింబమగు ప్రత్యగభిన్నమైన ఆ ఒక్క పరబ్రహ్మ మాత్రముగా అయిపోవుచున్నది.

ఏవం చ సతి "మనసైవానుద్రష్టవ్యం" (బృహ 4-4-19)
"యన్మనసా న మనుతే" (కేన 1-5) ఇత్యనయోః
శ్రుత్యోరవిరోధో వృత్తివ్యాప్యత్వాంగీకారేణ
ఫలవ్యాప్యత్వ ప్రతిషేధ ప్రతిపాదనాత్ ॥ 174

తా॥ ఇది ఇట్లుండుటచేత "ఆ ఆత్మ మనస్సుచేతనే తెలుసుకొనదగినది" (మనసైవానుద్రష్టవ్యం) అనునట్టియు, "మనసు దేనిని ధ్యానము చేయలేదో" (యన్మనసానమనుతే) అనునట్టియు నీ శ్రుతివాక్యములకు గల విరోధము పోవుచున్నది. ఏలననగా ఆ పరబ్రహ్మ వృత్తివ్యాపిమాత్రమై యున్నది. కాని ప్రకాశరూప ఫలమును వ్యాపించియుండలేదు. కావున వృత్తి నశించగానే ప్రతిబింబమైన జీవభావము నశించుచున్నది. కాని ఆత్మ స్వయంప్రకాశము కావున అది ప్రకాశరూప ఫలమందు వ్యాపించకపోవుటచేత ఆత్మను ప్రకాశింపజేయలేదు.

తదుక్తం—

ఫలవ్యాప్యత్వమేవాస్య శాస్త్రకృద్భిర్నివారితం।
బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తివ్యాప్తిరపేక్షితా ఇతి॥
(పంచదశీ 6-90) 175

తా॥ ప్రత్యగాత్మ పరమాత్మను ప్రకాశింపజేయుచున్నది అను ఆత్మకు ఫలవ్యాప్యత్వమును శాస్త్రకర్తలు ప్రతిషేధించియున్నారు. ఆ పరమాత్మ స్వయంప్రకాశము కాబట్టి. ఇంక ఆ పరమాత్మ చిత్తవృత్తియందు వ్యాపించి (ప్రతిబింబించి) యున్నదని అంగీకరించియున్నారు. ఆ బ్రహ్మయందు భాసమానమగు అజ్ఞానమును నశింపజేయుటకై యీ వృత్తివ్యాపనము కావలసియున్నది.

"స్వయంప్రకాశమానత్వాన్నాభాస ఉపయుజ్యతే" ఇతిచ॥
(పంచదశీ 6-92) 176

తా॥ ఆ బ్రహ్మ స్వయంప్రకాశమగుటచే తనను ప్రకాశింపజేయుటకై అది ప్రత్యగాత్మపై ఆధారపడ లేదు.

జడపదార్థాకారాకారితచిత్తవృత్తేర్విశేషోఽస్తి॥ 177

తా॥ అయితే జడపదార్థాకారాకారితమైనపుడు చిత్తవృత్తిలో విశేషమున్నది.

తథాహి - అయం ఘట ఇతి - ఘటాకారాకారితచిత్త
వృత్తిరజ్ఞాతం ఘటం విషయీకృత్య తద్గత అజ్ఞాన నిరసన
పురస్సరం స్వగతచిదాభాసేన జడం ఘటమపి భాసయతి॥ 178

తా॥ అది ఎట్లనగా అయం ఘటః - ఇది కుండ అనునప్పుడా ఘటముయొక్క ఆకారమును పొందిన చిత్తవృత్తి అదివరకు అజ్ఞాతమైన ఘటమువైపు మరలి ఘటవిషయకమైన తన అజ్ఞానమును తొలగించుటయేకాక తన జ్ఞానముచే దానిని ఘటము అని తెలియజేయుచున్నది.

తదుక్తం—

బుద్ధి తత్స్థచిదాభాసౌ ద్వావపి వ్యాప్నుతో ఘటం।
తత్రాజ్ఞానం ధియా నశ్యేదాభాసేన ఘటః స్ఫురేదితి॥
(పంచదశీ 7-91) 179

తా॥ బుద్ధియు దానియందలి చిదాభాసమున్ను రెండును ఘటమునందు వ్యాపించుచున్నది. బుద్ధి అజ్ఞానమును నశింపజేయుచున్నది. చైతన్యముచేత ఘటము ప్రకాశించుచున్నది. (తెలియుచున్నది.)

యథా దీపప్రభామండలమంధకారగతం ఘటపటాదికం
విషయీకృత్య తద్గతాంధకారనిరసనపురస్సరం స్వప్రభయా
తదపి భాసయతీతి॥ 180

తా॥ దీపకాంతి ఘటపటాదుల నావరించిన అంధకారమును నశింపజేసి తన కాంతిచే ఆ ఘటపటాది పదార్థములను ప్రకాశింపజేయుచున్నది. పదార్థముపైనుండి అంధకారము తొలగుట దీపము సన్నిహితము కాగానే జరుగుచున్నదికాని దీపకాంతి ఆ పదార్థముపై పడినపుడే అది ఘటము - పటము అను తద్విషయక పదార్థజ్ఞానము కలుగుచున్నది. (కావున దీపకాంతి వృత్తివ్యాప్యము. దీపప్రభ ఫలవ్యాప్యము అగుచున్నది)

---

# అధ్యాయము ౫

## ఆత్మజ్ఞాన మార్గములు

### వేదాంత శాస్త్ర గ్రంథ అధ్యయనము

ఏవంభూత స్వస్వరూప చైతన్య సాక్షాత్కార పర్యంతం
శ్రవణమనన నిధిధ్యాసన సమాధ్యనుష్ఠానస్యాపేక్షి
తత్వాత్తేఽపి ప్రదర్శ్యంతే ॥ 181

తా॥ ఈ విధమైన శుద్ధచైతన్యరూప ఆత్మసాక్షాత్కారము కలుగు నంతవరకును శ్రవణమును మననమును, నిధిద్యాసను, సమాధిని అభ్యసించవలసి యున్నది కావున ఆ శ్రవణాదుల నిచట వివరించుచున్నారు.

శ్రవణంనామ షడ్విధలింగై రశేషవేదాంతానా
మద్వితీయ వస్తుని తాత్పర్యావధారణం ॥ 182

తా॥ షడ్విధలింగముల ద్వారా ఎల్ల వేదాంతగ్రంధములకును అద్వితీయమైన ఆ పరమాత్మయందే తాత్పర్యము అను నిర్ధారణకలుగుట - శ్రవణము అగును.

లింగాని తూపక్రమోపసంహారాభ్యాసాపూర్వతాఫలార్థ
వాదోపపత్త్యాఖ్యాని ॥ 183

తా॥ ఉపక్రమ - ఉపసంహారములు, అభ్యాస, అపూర్వతా, ఫలము, అర్థవాదము, ఉపపత్తి అనునవి ఆరు లింగములు.

తదుక్తం—

ఉపక్రమోపసంహారావభ్యాసోఽపూర్వతా ఫలం ।
అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్యనిర్ణయే ॥ 184

తా॥ శాస్త్రగ్రంథముయొక్క తాత్పర్యమును నిర్ణయించుటకు ఉపక్రమ ఉపసంహారములు, అభ్యాసము, అపూర్వతా, ఫలము, అర్థవాదము, ఉపపత్తి అనెడి ఆరువిధములైన లింగములు ఉపయోగపడుచున్నవి.

ప్రకరణప్రతిపాద్యస్యార్థస్య తదాద్యంతయోరుపపాదన ముపక్రమోప సంహారౌ । యథా ఛాందోగ్యే షష్ఠాధ్యాయే ప్రకరణప్రతిపాద్యస్యాద్వితీయవస్తున "ఏకమేవాద్వితీయం" (6-2-1) ఇత్యాదౌ. "ఐతదాత్మ్యమిదం సర్వం" (6-8-7) ఇత్యన్తే చ ప్రతిపాదనం ॥ 185

తా॥ ప్రకరణముచేత చెప్పదగిన విషయములయొక్క ఆది అంతములు ఉపక్రమ - ఉపసంహారములనబడుచున్నవి. ఛాందోగ్యమందు షష్ఠాధ్యాయమున ప్రకరణముచేత చెప్పబడిన అద్వితీయ బ్రహ్మను గురించి "ఏకమేవ అద్వితీయం" అని ఆదియందును, "ఐతదాత్మ్యం ఇదం సర్వం" అని అంతమందును ఉపక్రమ ఉపసంహారములుగా చెప్పబడినవి.

ప్రకరణప్రతిపాద్యస్య వస్తునస్తన్మధ్యే పౌనఃపున్యేన ప్రతిపాదనమభ్యాసః । యథా తత్రైవాద్వితీయవస్తునో మధ్యే తత్త్వమసీతి నవకృత్వః ప్రతిపాదనం ॥ 186

తా॥ ప్రకరణముచేత చెప్పదగిన విషయమును ఆ ప్రకరణ మధ్య మందు మాటిమాటికి చెప్పుట అభ్యాసము. ఆ చాంధోగ్యోపనిషత్తు షష్ఠాధ్యాయములోనే అద్వితీయ తత్త్వమును ప్రతిపాదించునపుడు తత్త్వమసీతి వాక్యము తొమ్మిదిసార్లు చెప్పబడినది. ఇట్లు మరల మరల తొమ్మిదిసార్లు చెప్పుట అభ్యాసము.

ప్రకరణప్రతిపాద్యస్యాద్వితీయవస్తునః ప్రమాణాంత
రావిషయీకరణ మపూర్వతా। యథా తత్రైవాద్వితీయ
వస్తునో మానాంతరావిషయీకరణం॥ 187

తా॥ ప్రకరణముచేత చెప్పదగిన ఆ అద్వితీయ తత్త్వము ప్రమాణాంతరములచే సాధించుటకు అశక్యమగుట అపూర్వత యగును. ఆ చాందోగ్యోపనిషత్తునందే ఆ అద్వితీయబ్రహ్మతత్త్వము శ్రుతిచేత అనగా శబ్దప్రమాణముచే తప్ప తదితర ప్రమాణములచే నిరూపితము కాకపోవుటయే అచటి అపూర్వత.

ఫలంతు ప్రకరణప్రతిపాద్యస్యాత్మజ్ఞానస్య
తదనుష్ఠానస్య వా తత్ర తత్ర శ్రూయమాణం
ప్రయోజనం। యథా తత్ర "ఆచార్యవాన్ పురుషో
వేద తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ
సంపత్స్యే" (6-14-2) ఇత్యద్వితీయ వస్తుజ్ఞానస్య
తత్ప్రాప్తిః ప్రయోజనం శ్రూయతే॥ 188

తా॥ ప్రకరణముచే చెప్పదగిన విషయమగు ఆత్మజ్ఞానమునకు గాని తదభ్యాసమునకు గాని అచటచట చెప్పబడిన ప్రయోజనము ఫలమనబడుచున్నది. ఆ ఛాందోగ్యమునందే "ఆచార్యవంతుడైన పురుషుడు ఆ బ్రహ్మను

తెలిసికొనుచున్నాడు, కావున అతడు ఈ దేహమును విడచుటయే తడవు వెంటనే బ్రహ్మైక్యమును పొందుచున్నాడు" అని ఆ అద్వైతవస్తు జ్ఞానమునకు ఆ బ్రహ్మైక్యమే ఫలమని చెప్పబడియున్నది.

ప్రకరణప్రతిపాద్యస్య తత్ర తత్ర ప్రశంసనమర్థవాదః ।
యథా తత్రైవ "ఉత తమాదేశమప్రాక్ష్యో యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతం (6-1-3) ఇత్యద్వితీయవస్తు ప్రశంసనం ॥ 189

తా॥ ప్రకరణమందు ప్రతిపాదించిన విషయమును అచట అచట ప్రశంసించుట అర్థవాదము - "దేనిచేత విననిదానిని వినగలుగుచున్నావో, చూడనిదానిని చూడగలుగుచున్నావో, చింతించనిదానిని చింతించగలుగుచున్నవో, తెలియనిదానిని తెలిసికొనుచున్నావో అట్టి యా ఉపదేశమును గూర్చి నీవడిగితివా ?" అను నీ పరమాత్మయొక్క ప్రశంసలన్నియు అర్థవాదములనబడుచున్నవి.

ప్రకరణప్రతిపాద్యార్థసాధనే తత్ర తత్ర శ్రూయమాణా యుక్తిరుపపత్తిః । యథా తత్ర "యథా సౌమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" (6-1-4) ఇత్యాద్యావద్వితీయవస్తుసాధనే వికారస్య వాచారంభణ మాత్రత్వే యుక్తిః శ్రూయతే ॥ 190

తా॥ ప్రకరణమునందు ప్రతిపాదించిన విషయమును సాధించుటకు అచటచట చూపబడు యుక్తియే యుపపత్తి। ఎట్లనగా ఆ ఛాందోగ్యమునందే "ఒక మట్టి ముద్దను చూచి కుండ, కూజా మొదలైనవి నామరూప

ములు కేవలము వాగాడంబరములేననియు, అందున్న మట్టి మాత్రము సత్యమైనదనియు ఎట్లు తెలిసికొనుచున్నావో" అనునది అద్వితీయ వస్తువును సాధించుటకు యుక్తియగుచున్నది. నామరూపాత్మక జగత్తంతయు వాచారంభణమాత్రమనియు, అద్వితీయవస్తుమాత్రమే సత్యమనియు ఈ యుక్తిచేత సాధింపబడుచున్నది.

మననం తు శ్రుతస్యాద్వితీయ వస్తునో వేదాంతానుగుణ యుక్తిభిరనవరతమనుచింతనం ॥ 191

తా॥ గురువులవలన వినిన వేదాంతమున కనుగుణమైన యుక్తులచేత అద్వితీయమైన బ్రహ్మతత్త్వమును విడువకుండ చింతించుట మననము.

విజాతీయ దేహాదిప్రత్యయరహిత అద్వితీయవస్తు సజాతీయ ప్రత్యయప్రవాహో నిదిధ్యాసనం ॥ 192

తా॥ ఆ అద్వితీయవస్తువునకు విజాతీయమైన దేహాదులయొక్క చింతనలు మధ్య మధ్య రాకుండ ఆ అద్వితీయవస్తువునకు సజాతీయమైన ధ్యానప్రవాహమే నిధిధ్యాస మనబడును.

## సమాధి - తల్లక్షణము - తద్భేదములు

సమాధిర్ద్వివిధః సవికల్పకో నిర్వికల్పకశ్చేతి ॥ 193

తా॥ సవికల్పకమని నిర్వికల్పకమని సమాధి రెండువిధములు.

తత్ర సవికల్పకో నామ జ్ఞాతృజ్ఞానాదివికల్పలయానపేక్షయా అద్వితీయవస్తుని తదాకారాకారితాయాశ్చిత్తవృత్తేరవస్థానం ॥ 194

తా॥ జ్ఞాత - జ్ఞానము - జ్ఞేయము అను త్రిపుటి గోచరించుచుండగనే అద్వితీయబ్రహ్మతత్త్వమందు తదాకారితమైన చిత్తవృత్తిని నిలుపుట సవికల్పక సమాధి యనబడును.

తదా మృన్మయగజాదిభానేఽపి మృద్భానవత్
ద్వైతభానేఽప్యద్వైతం వస్తు భాసతే॥ 195

తా॥ మట్టి ఏనుగును చూచినప్పటికిని మట్టి మనకు ప్రత్యేకముగా తోచునట్లు ఈ సవికల్పక సమాధియందు పై త్రిపుటి గోచరించుచున్నను ఆ అద్వైతవస్తువు తోచుచునే యుండును.

తదుక్తం—

"దృశిస్వరూపం గగనోపమం పరం సకృద్విభాతం
త్వజమేకమక్షరం। అలేపకం సర్వగతం యదద్వయం తదేవ
చాహం సతతం విముక్తమోం॥"
ఇతి ఉపదేశసాహస్రీ (73-10-1) 196

తా॥ సాక్షి స్వరూపమైనదియు ఆకాశముతో సమానమైనదియు, సర్వోత్కృష్టమైనదియు, శాశ్వతముగా ప్రకాశించునట్టిదియు, పుట్టుకలేనిదియు, అద్వితీయమైనదియు, నాశములేనిదియు, దేనికి అంటనిదియు, సర్వవ్యాపియు, సర్వదాముక్తమైనదియు, యే అద్వయ బ్రహ్మగలదో అదియే నేను - ఓం" అని ఉపదేశసాహస్రియందు చెప్పబడియున్నది.

నిర్వికల్పకస్తు జ్ఞాతృజ్ఞానాదివికల్పలయాపేక్షయాద్వితీయ
వస్తుని తదాకారాకారితాయాశ్చిత్తవృత్తే రతితరామేకీ
భావేనావస్థానం॥ 197

తా॥ జ్ఞాత - జ్ఞానము - జ్ఞేయము అను త్రిపుటి తోచకుండ ఆ అద్వితీయవస్తువునందు తదాకారాకారితమైన చిత్తవృత్తిని అత్యంత ఐక్యభావములో నుంచుట నిర్వికల్పక సమాధి యనబడుచున్నది.

తదా తు జలాకారాకారితలవణానవభాసేన జలమాత్రత్వా భాసవదద్వితీయ వస్త్వాకారాకారిత చిత్తవృత్త్యనవభాసేనా ద్వితీయ వస్తుమాత్రమవభాసతే ॥ 198

తా॥ నీటియందు వేయబడిన ఉప్పు ఆ జలాకారాకారితమై కనబడక జలము మాత్రము గోచరించునట్లు అద్వితీయవస్తు ఆకారాకారితమైన చిత్తవృత్తి గోచరించక కేవల అద్వయవస్తు మాత్రము అపుడు గోచరించును.

## సమాధి - సుషుప్తి

తతశ్చాస్య సుషుప్తేశ్చాభేదశంకా న భవతి। ఉభయత్ర వృత్త్యభానే సమానేఽపి తత్సద్భావాసద్భావ మాత్రేణ అనయోః భేదోపపత్తేః॥ 199

తా॥ అందువలన యీ సమాధికిని సుషుప్తికిని భేదములేదు అను శంక కలుగదు. రెండింటియందును వృత్తి భాసించకపోవుట సమానమైనప్పటికి సుషుప్తియందు చిత్తవృత్తి తత్కారణమగు అజ్ఞానమునందు పూర్తిగా లీనమగుటచేత అది లేనిదగుచున్నది. సమాధియందు ఆ చిత్తవృత్తి కనబడక పోయినప్పటికిని అది బ్రహ్మాకారాకారితమై యున్నది. ఇట్లు చిత్తవృత్తి ఉండుట చిత్తవృత్తి లేకపోవుట అనునదియే సమాధి సుషుప్తులకు మధ్యగల భేదము ఇట్టి భేదము స్పష్టముగా కనబడుటచే ఆ రెండింటికిని భేదము లేదని శంకించరాదు.

## అష్టాంగ సాధనములు

అష్టాంగాని యమనియమాసనప్రాణాయామ ప్రత్యాహార
ధారణా ధ్యాన సమాధయః ॥ 200

తా॥ ఈ నిర్వికల్పక సమాధికి యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి అని యెనిమిది అంగములు కలవు.

తత్ర 'అహింసాసత్యమస్తేయబ్రహ్మచర్యా
పరిగ్రహాయమాః ॥' 201

తా॥ అందు హింస చేయకుండుట, సత్యముపలుకుట దొంగబుద్ధిలేకుండుట, బ్రహ్మచర్యము, దానము పుచ్చుకొనకుండుట అనునవి యమములు.

"శౌచసంతోషతపః స్వాధ్యాయేశ్వరప్రణిధానాని
నియమాః ॥" 202

తా॥ శుచిగా ఉండుట, సంతోషము, తపస్సు, వేదపఠనము, ఈశ్వరధ్యానము అనునవి నియమములు.

కరచరణాది సంస్థాన విశేషలక్షణాని పద్మస్వస్తికాదీ
న్యాసనాని ॥ 203

తా॥ కరచరణాదులను ప్రత్యేకవిధములో ఉంచుటయే ఆసనములు. అవి పద్మాసనము స్వస్తికాసనము మొదలైనవి.

రేచక పూరక కుంభకలక్షణాః ప్రాణనిగ్రహోపాయాః
ప్రాణాయామాః ॥ 204

తా॥ రేచకము, పూరకము, కుంభకము అను ప్రాణవాయువును స్తంభింపజేయునట్టి ఉపాయములే ప్రాణాయామములు.

ఇంద్రియాణాం స్వస్వవిషయేభ్యః ప్రత్యాహరణం ప్రత్యాహారః ॥ 205

తా॥ ఇంద్రియములను తమ తమ విషయములనుండి మరలించుకొనుట ప్రత్యాహారము.

అద్వితీయ వస్తున్యంతరింద్రియధారణం ధారణా ॥ 206

తా॥ అద్వితీయమైన ఆ పరబ్రహ్మ వస్తువునందు అంతరింద్రియమైన మనస్సును స్థాపించుట ధారణయగును.

తత్రాద్వితీయ వస్తుని విచ్ఛిద్య విచ్ఛిద్యాంతరింద్రియ వృత్తి ప్రవాహో ధ్యానం॥ 207

తా॥ ఆ అద్వితీయ బ్రహ్మవస్తువునందు అప్పుడప్పుడు తెగుచు తెగుచు జరుగునట్టి చిత్తవృత్తి ప్రవాహము ధ్యానమన బడును.

సమాధిస్తూక్తః సవికల్పక ఏవ ॥ 208

తా॥ ఇదివరకు వివరించబడిన సవికల్పక సమాధియే యిచట చెప్ప బడిన సమాధి

## సమాధి ప్రతిబంధకములు - తన్నివారణము

ఏవమస్యాంగినో నిర్వికల్పకస్య లయవిక్షేపకాషాయ రసాస్వాదలక్షణాశ్చత్వారో విఘ్నాః సంభవంతి ॥ 209

తా॥ ఇట్టి అష్టాంగములతో కూడినట్టి అంగియగు నిర్వికల్పక సమాధికి లయము - విక్షేపము - కషాయము - రసాస్వాదము అను నాలుగు విఘ్నములు కలుగును.

లయస్తావదఖండవస్త్వనవలంజనేన చిత్తవృత్తే ర్నిద్రా॥ 210

తా॥ అఖండవస్తువునందు పట్టు దొరకక పోవుటచేత చిత్తవృత్తికి కలుగు నిద్ర లయము,

అఖండ వస్త్వనవలంబేన చిత్తవృత్తేరన్యావలంబనం విక్షేపః॥ 211

తా॥ అఖండ వస్తువునందు పట్టు దొరకకపోవుటచేత చిత్తవృత్తి ఇతరమును పట్టుకొనుట విక్షేపము.

లయ విక్షేపాభావేఽపి చిత్తవృత్తేః రాగాదివాసనయా స్తబ్ధీభావనాద ఖండవస్త్వనవలంబనం కషాయః॥ 212

తా॥ ఇట్టి లయవిక్షేపములు లేకపోయినప్పటికిని పూర్వపు కోరికల యొక్క వాసనలచేత చిత్తవృత్తి స్తబ్ధమై ఆ అఖండవస్తువును అందుకోలేక పోవుట కషాయము.

అఖండవస్త్వనవలంబనేనాపి చిత్తవృత్తేః సవికల్ప కానందాస్వాదనం రసాస్వాదః। సమాధ్యారంభసమయే సవికల్పకానందాస్వాదనం వా॥ 213

తా॥ అఖండవస్తువును అందుకోలేకపోయినప్పటికిని చిత్తవృత్తి సవికల్పక సమాధియందు ఆనందమును ఆస్వాదించుచు పైకి పోకుండ ఉండి

పోవుట రసాస్వాదము లేక నిర్వికల్పక సమాధియొక్క ఆరంభమందే సవికల్పక సమాధివలన కలుగు ఆనందమును ఆస్వాదించుచుండుటయే రసాస్వాదము.

అనేన విఘ్నచతుష్టయేన విరహితం చిత్తం నిర్వాత దీపవదచలం సదఖండచైతన్యమాత్రమవతిష్ఠతే యదా తదా నిర్వికల్పకః సమాధిరిత్యుచ్యతే ॥ 214

తా॥ ఇట్టి నాలుగు విఘ్నములు లేనిదైన మనస్సు నిర్వాతదీపమువలె అచలము అఖండచైతన్యరూపమునై ఎప్పుడుండునో అదియే నిర్వికల్పక సమాధియనబడుచున్నది.

తదుక్తం—

లయే సంబోధయేచ్చిత్తం విక్షిప్తం శమయేత్పునః ।
సకషాయం విజానీయాచ్ఛమ ప్రాప్తం న చాలయేత్ ॥
నాస్వాదయేద్రసం తత్ర నిస్సంగః ప్రజ్ఞయా భవేత్
ఇతిచ (గౌడపాదకారికా 3-44-45) "యథా దీపోనివాతస్థో నేంగతే సోపమాస్మృతా" ఇతిచ (గీతా 6-19) 215

తా॥ లయమందు చిత్తమును మేలుకొలుపవలెను. చెదరిపోయినప్పుడు దానిని శాంతింపచేయవలెను. కషాయమందు తెలిసికొనవలెను. శాంతిని పొందినదానిని కదల్పకూడదు. అచట రసాస్వాదమందు తగుల్కొనక నిస్సంగుడై ప్రజ్ఞతో ఉండవలెను అని గౌడపాదకారిక చెప్పుచున్నది.

గాలిలేని నివాతస్థలమందుంచబడిన దీపముతో ఆస్థితి పోల్చబడు చున్నదని గీత చెప్పుచున్నది.

# అధ్యాయము ౬

## జీవన్ముక్త లక్షణము

అథ జీవన్ముక్త లక్షణముచ్యతే॥ **216**

తా॥ ఇప్పుడు జీవన్ముక్త లక్షణము చెప్పబడుచున్నది.

జీవన్ముక్తోనామ స్వస్వరూపాఖండబ్రహ్మజ్ఞానేన
తదజ్ఞాన బాధనద్వారా స్వస్వరూపాఖండబ్రహ్మణి సాక్షా
త్కృతేఽజ్ఞాన తత్కార్య సంచితకర్మసంశయ విపర్యయా
దీనామపి బాధితత్వాదఖిలబంధరహితో బ్రహ్మనిష్ఠః॥ **217**

తా॥ స్వస్వరూపమైన అఖండ బ్రహ్మజ్ఞానముద్వారా అందలి అజ్ఞానమును తొలగించి స్వస్వరూపమైన అఖండబ్రహ్మను సాక్షాత్కరించుకొనుట చేత అజ్ఞానమును దాని కార్యమైన సంచితకర్మలను, సంశయవిపర్యయాదులను నశింపజేసినవాడగుచున్నాడు. కావున అతడు ఎల్ల బంధములు తొలగిన వాడై బ్రహ్మనిష్ఠుడగుచున్నాడు.

భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః।
క్షీయన్తేచాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥"
ఇత్యాదిశ్రుతే (ముణ్డక 2-2-8) **218**

తా॥ ఆ పరబ్రహ్మ సాక్షాత్కారము కాగానే అవిద్యా కామ కర్మ రూపమైన హృదయగ్రంథి విడివడుచున్నది. సందేహములన్నియు తెగి పోవుచున్నవి. ఇతని సంచిత ఆగామికర్మలన్నియు నశించుచున్నవి." అని ముండకోపనిషత్తు చెప్పుచున్నది.

అయం తు వ్యుత్థానసమయే మాంసశోణితమూత్రపురీషాది భాజనేన శరీరేణాంధ్యమాంద్యాపటుత్వాది భాజనేనేంద్రియగ్రామేణాశనాపిపాసాశోకమోహాది భాజనేనాంతః కరణేన చ పూర్వపూర్వ వాసనయా క్రియమణాని కర్మాణి భుజ్యమానాని జ్ఞానావిరుద్ధాశబ్ధ ఫలాని చ పశ్యన్నపి బాధితత్వాత్పరమార్థతో న పశ్యతి। యథేంద్ర జాలమితి జ్ఞానవాం స్తదింద్రజాలం పశ్యన్నపి పరమార్థమిదమితి న పశ్యతి॥ 219

తా॥ ఇట్టి బ్రహ్మజ్ఞాని ఆ సమాధినుండి వ్యావహారిక జగత్తులోనికి వచ్చినపుడు రక్తమాంసమూత్రపురీషాదులకు స్థానమైన యీ శరీరముతోను, గ్రుడ్డితనము - మొద్దుతనము - అశక్తత మొదలైనవానికి స్థానమైన ఇంద్రియములతోను, ఆకలిదప్పులకు దుఃఖమోహాదులకు స్థానమైన అంతఃకరణలోను పూర్వపూర్వవాసనల ననుసరించి కర్మలను చేయుచున్నాడు. వానివలన జ్ఞానమునకు విరుద్ధముకాని అనగా క్రొత్తవాసనలను సృష్టించలేనట్టి ఫలముల ననుభవించుచున్నాడు. ఇట్లు ప్రపంచమును చూచుచు అనుభవించుచున్నప్పటికిని బ్రహ్మజ్ఞానముచే నిదియంతయు మిథ్య యని తెలిసినవాడగుటచేత నిజముగా చూడనివాడే యగుచున్నాడు. అది సమంజసమే. ఏలయన ఇంద్రజాలమని తెలిసినవాడు ఆ ఇంద్రజాలమును చూచుచున్నప్పటికిని అది వాస్తవమని అనుకొనడు కదా.

“సచక్షురచక్షురివ సకర్ణోఽకర్ణ ఇవ” ఇత్యాదిశ్రుతేః॥ 220

తా॥ కండ్లున్నవాడైనప్పటికిని కండ్లు లేనివానివలె, చెవులున్న

వాడైనప్పటికిని చెవులు లేనివానివలె అని యీ విషయమును శ్రుతి చెప్పుచున్నది.

ఉక్తంచ—

సుషుప్తవజ్జాగ్రతి యో న పశ్యతి ద్వయం చ పశ్యన్నపి
చాద్వయత్వతః। తథాచకుర్వన్నపి నిష్క్రియశ్చ యః
స ఆత్మవిన్నాన్య ఇతీహ నిశ్చయః॥
ఇతి (ఉపదేశసాహస్రీ-5) 221

తా॥ మరియు - సుషుప్తియందువలె జాగ్రదవస్థయందును ఎవడు చూడకున్నాడో, రెండింటిని చూచినపుడు ఆ రెండింటిలో ఐక్యమును ఎవడు చూడగలుగుచున్నాడో, అదేవిధముగా కర్మలు చేయుచున్నను ఎవడు కర్మలు చేయనివాడగుచున్నాడో అతడే ఆత్మజ్ఞాని ఇతరుడుకాదు. ఇది నిశ్చయము అని ఉపదేశసాహస్రి చెప్పుచున్నది.

అస్య జ్ఞానాత్పూర్వం విద్యమానానామేవాహారవిహారాదీనా
మనువృత్తివచ్ఛుభవాసనానామేవానువృత్తిర్భవతి
శుభాశుభయో రౌదాసీన్యం వా॥ 222

తా॥ ఇతడు తాను జ్ఞానము పొందకముందు ఆహారవిహారాదులం దెట్లుండునో జ్ఞానము పొందినవెనుకను అతడట్టి ఆహారవిహారాదులనే కలిగి యుండును. అట్టి ఆహారవిహారములు లా జ్ఞానిని అనుసరించి యున్నట్లే శుభ వాసనలు కూడ ఆ జ్ఞానిని అనుసరించియే యుండును. లేదా అతడు శుభా శుభములందు ఔదాసిన్యము వహించియుండును.

బుద్ధాద్వైతసతత్త్వస్య యథేష్టాచరణం యది।
శునాం తత్త్వదృశాంచైవ కో భేదోఽశుచి భక్షణే॥ ఇతి
(నైష్కర్మ్యసిద్ధిః 4-62)
బ్రహ్మవిత్త్వం తథా ముక్త్వా స ఆత్మజ్ఞో న చేతరః॥ ఇతి
చ (ఉపదేశసాహస్రీ 115) 223

తా॥ బుద్ధుడై అద్వైత తత్త్వమును తెలిసికొనినవానికి యథేష్టాచరణమును అనుమతించినయెడల జ్ఞానికిని కుక్కకును అశుచి భక్షణమందు భేదమేమి యుండును అని నైష్కర్మ్య సిద్ధియందు చెప్పబడియున్నది.

మరియు - నేను ఆత్మజ్ఞానిని అను భావమును వదలినవాడే ఆత్మజ్ఞాని యగుచున్నాడు. ఇతరుడు కాడు అని ఉపదేశ సాహస్రి చెప్పుచున్నది.

తదానీమమానిత్వాదీని జ్ఞానసాధనాని అద్వేష్టృత్వా

దయః సద్గుణాశ్చాలంకారవదనువర్తంతే॥ 224

తా॥ అట్టి ఆత్మజ్ఞానికి అమానిత్వము, అదంభిత్వము మొదలైన జ్ఞాన సాధనములును, అద్వేష్టాసర్వభూతానాం మైత్రః - మొదలైన అద్వేష్టృత్వాది సద్గుణములను కేవలము అలంకారభూతములై యుండును. (అమానిత్వ అద్వేష్టృత్వాదులు గీతలో వివరింపబడినవి.)

తదుక్తం—

ఉత్పన్నాత్మావబోధస్య హ్యద్వేష్టృత్వాదయో గుణాః।
అయత్నతో భవంత్యస్య న తు సాధన రూపిణః॥ ఇతి
(నైష్కర్మ్యసిద్ధిః 4-69) 225

తా॥ మరియు, ఆత్మజ్ఞానికి అద్వేష్టృత్వాది గుణములన్నియు సహజముగానే యుండును కాని అవి అతడు ప్రయత్నించి సాధించవలసిన సాధనలు మాత్రము కావు. అని నైష్కర్మ్యసిద్ధి చెప్పుచున్నది.

## కైవల్యసిద్ధి లేదా బ్రహ్మత్వసిద్ధి

కిం బహునాయం దేహయాత్రామాత్రార్థమిచ్ఛానిచ్ఛా పరేచ్ఛాప్రాపితాని సుఖదుఃఖలక్షణాన్యారబ్ధ ఫలాన్యనుభవన్నంతః కరణాభాసాదీనామవభాసకః సంస్తదవసానే ప్రత్యగానంద పరబ్రహ్మణి ప్రాణే లీనే సత్యజ్ఞానతత్కార్య సంస్కారాణామపి వినాశాత్పరమకైవల్యమానందైకరస మఖిలభేదప్రతిభాసరహితమఖండబ్రహ్మావతిష్ఠతే ॥ 226

తా॥ పెక్కుమాటలేల, అట్టి ఆత్మజ్ఞాని కేవలము దేహయాత్రకై స్వేచ్ఛా పరేచ్ఛా అనిచ్ఛాప్రాప్తములైన సుఖదుఃఖములను ప్రారబ్ధఫలమును అనుభవించుచున్నవాడై, ఇతరవస్తువులను ప్రకాశింపజేయు అంతఃకరణ వృత్తులను కూడ ప్రకాశింపజేయుచు, దేహావసానమందు ప్రత్యగానంద పరబ్రహ్మమునందు ప్రాణము లయముచెందగా సత్యజ్ఞానములు తత్కార్యములైన సంస్కారములు నశించి కేవలము, ఆనందైకరసరూపము, సమస్తభేద భావములను తొలగించునట్టిదియునైన అఖండ బ్రహ్మగా ఉండిపోవుచున్నాడు.

"న తస్య ప్రాణా ఉత్క్రామంతి" (బృహ 4-4-6)
"అత్రైవ సమవనీయన్తే" (బృహ 3-2-11) "విముక్తశ్చ విముచ్యతే" ఇత్యాది శ్రుతేః ॥ 227

తా॥ అతని ప్రాణములు పైకి పోవుటలేదు ఆత్మయందే లీనమగుచున్నవి అనియు, "కావున అతనికి ప్రాణము పోవుట అనునది లేదు ఆత్మయందే విలీనమగుచున్నవి" అనియు బృహదారణ్యకోపనిషత్తు చెపుచున్నది. మరియు, "దేహమును విడచినవాడై విదేహముక్తుడగుచున్నాడు" అని కఠోపనిషత్తు చెపుచున్నది.

ఓం తత్ సత్

Vedanta-Saara

Swami Sadananda Yogi.